# అభినవసరస్వతి.

సంపుట ౮ { జానవా॥. రాక్షస సం॥ పుష్య మాఘమాసము } సంచిక ౧,౨

## కృతివిమర్శనము.

జ్యోతిష్ఫలచర్చ — ఇది సుదర్శనీపత్రికాధిపతులగు కస్తూరి శివశంకరకవిగారిచే వ్రాయఁబడిన యొకవచనగ్రంథము - దీనింగాంచిన గ్రంథకర్త నాస్తికుఁడని కొందఱకు దోఁచినఁ దోఁపవచ్చును గాని చక్కఁగఁ బరిశీలించిన భూతదయకలవాఁడనియు స్వకార్యసిద్ధికై యొప్పుకొని సత్యాంశనిర్ధారణకై పాటుపడువాఁడనియుఁ దోఁపక పోదు. ఏననుసత్యమునకుఁ బాటుపడువారికే యొకప్పుడు సత్యాంశమందసత్యభ్రాంతి కలుగుచుండును. భావిఫలము తెలియఁబడినంతనే భవిష్యత్కార్యములకు భంగము ఘటిల్లి సృష్టికే వైపరీత్యము కలుగునని గ్రంథకర్త యభిప్రాయపడెఁగాని యట్లు పొసంగనేరదు. నలహరిశ్చంద్రాదులకైనను భావిఫలము తెలియక పోవచ్చును. తెలిసినను నదృష్టము నడ్డులేక పోవచ్చును - భవిష్యత్ జ్ఞానమే యలవడిన ననిష్టముల కడ్డుఁ గలిగించుకొందురనియు నట్లడ్డుగలిగించుకొనఁగలిగినపుడు "కానున్నది కాకమాన" దను సిద్ధాంతము మోఘమగుననియు వ్రాయుచు నందు విషయమై యొకదినమునఁ దనకు జలగండమున్నదని మానవునకు దెలిసినప్పు డది తప్పించుకొన నేల ప్రయత్నింపఁడు? ప్రయత్నించినను దప్పదనియుండు గేని యట్లను వారు నిర్విచారపురుషులు, తోఁచినట్లు వ్రాయువారలు" నని కడునీచముగం దీసివైచిరి కాని యదియు నిలుచుమాట కాదు. జలగండమున్నదని తెలిసి జాగ్రత్తతో నున్నను నున్మాదవశమునో యేటిలో బావిలో దూకవలెనని బుద్ధి పొడమవచ్చును - అట్లున్మత్తుఁడైనఁ దదీయులేని వానిని గాపాడుదురనుట కంతకుఁబూర్వము తెలివిగలిగియేయుండి తత్కాలమున కకస్మాత్తుగఁ జైత్యభ్రమేర్పడ బావికురుకవచ్చును - ఇట్టివి మనయనుభవమందే కొన్ని గాంచుచున్నవి. భృంగిముని శాపమునఁ దనకుఁ గలుగనున్న స…
చావు నెఱింగి కడుజాగ్రత్తపడియుఁ దప్పించుకొననేర…
క్షిత్తుకూడ నీవిషయమునఁ బెద్దదృష్టాంతము.

ఫలము మన మెంతజాగ్రత్తతో నున్నను దప్పదనుట కిట్టియుక్తులు
పెక్కులుగన్పట్టెడి. ఈగ్రంథమున నిట్టియుక్తులచేతనే ఫలశాస్త్రమం
దు విశ్వాసముగలజనులు చాలఁ బరిహసింపఁబడియున్నవారు- కాని
మాటకుఁ బైమాటయు యుక్తికిఁ బైయుక్తియు లేకపోలేదు. సంపూ
ర్ణజ్ఞానముగలవారు తఱచు లేకపోవుటచే సామాన్యులు చెప్పినఫలము
లొకవేళఁ దప్పిపోయినఁ బోవచ్చును గాని యంతమాత్రమున
శాస్త్రమే యసత్యమని సాహసింపఁగూడదని మాతలంపు. అల్పజ్ఞులు
తాముచెప్పినఫలములు తప్పిపోయినపుడు " భవంతినభవంతిచ " యని
జ్యోతిశ్శాస్త్రమునకుఁ బార్వతీశాపమున్నదని చెప్పినఁ జెప్పెదురుగాక.
అది యంత విశ్వాసార్హమైన సంగతికాదు కావున నందుమీఁదఁ జేసిన
పూర్వపక్షములకు జవాబనవసరము. వేయేల? ఒక ఫలశాస్త్రము సత్
త్యమనుటలో మట్టుకు మాది భిన్నాభిప్రాయము కాని తక్కిన యీగ్రం
థమందలి జనుల మూఢవిశ్వాసాదులగురించి వ్రాసిన యంశము లేమి
యింకను నితరాంశములేమి సయుక్తికములుఁ జమత్కారజనకములు
నైయున్నయవి. మాకుండుభిన్నాభిప్రాయమును స్థిరపఱచుట కనేక
ము లుదాహరింపవలసియున్నను గ్రంథవిస్తరభీతిచే విరమించితిమి—

ఆంగ్లేయభాషాకోవిదులయ్యు, ఆస్తికత్వమువదలక వర్ణాశ్రమాచారనిరతులై
మాత్రభాష్యాది వేదాంతశాస్త్రపఠనపురస్సరంబుగ సర్వదా తత్త్వచింతాపరులై వర్తి
లుచున్న శ్రీ పింగరాజు సుబ్బారావుగారు గుంటూరు ప్రిన్సిపల్ డిస్ట్రిక్టుమునిసిఫ్ పద
వినుండి గుంటూరు అడిషనల్ సబ్జడ్జీపదవికిఁ బ్రమోషన్ చేయఁబడినందులకుఁ గాను
గుంటూరు న్యాయవాదులు మొదలగువా రీఫిబ్రవరి 1 వ తేదిని తమయానందమును వెల్ల
డించుచు గుంటూరు టవున్ హైస్కూలులో నొక స్వాగతసభం గావించి యందుఁ
బలుమంది యుపన్యాసములతోను బద్యములతోను సుబ్బారావుగారిని నుతించియుండిరి
వానిలో మాకులభించిన శ్రీ పాటిబండసూర్యనారాయణరావుగారి యొకపద్యముమా
త్రమిం దుదాహరించుచు నిట్టిసత్ప్రవర్తనగల సబ్జడ్జీగారిని సెషన్ జడ్జీపదవివఱకు పంపి
యాయురారోగ్యైశ్వర్యాదులొసంగుటకై పరమేశ్వరుని బ్రార్థించుచున్నవారము

॥ మనసెల్ల ధర్మవర్తనమందె సతతంబు సంధించిచరియించు సజ్జనుండు
మాత్ర మన్యాయమంటనిపరిశీలనము సేయు విశ్రుతన్యాయమూర్తి
వాక్క్రియాలందు నీశ్వరుసేవించు మహితనిశ్చలభక్తిమానసుండు
నొవ్వఁగఁజేయఁగల యొక్కమాటాడనేరని మార్దవుండు
ఘురాజు। అమలవేంకటసుబ్బరాయాభిధుండు
న్యాయమూర్తి। పదముతోఁ జిరజీవియై వరలుఁగాతః

# శ్రీ కృష్ణరాయ గ్రంథమాల.

ఇది కవిసార్వభౌముఁడును, రాజవతంసుఁడు, నగు శ్రీకృష్ణదేవరాయలజ్ఞాపకార్థమై, గంపలగూడెము. కుమారరాజావారగు శ్రీ కె. వి. కృష్ణారావు బహద్దరువారిచే, స్థాపింపఁబడినది. శ్రీకుమారరాజాగారు. రసజ్ఞులే కాక. సుప్రసిద్ధకవులగుటచే, విమర్శనబుద్ధితో, వర్తమాన, కాలమందలి గ్రంథమాలలొనరింపని, భాషోపకారకార్యంబులన్నింటిఁ దిలకించి, అట్టిలోపముం దీర్చుటకును, అభినవకృష్ణరాయ బిరుదాంకము సార్థకమొనరించుకొనుటకును, దీనిప్రతిష్ఠించిరి ఇందు సంవత్సరమునకు, నాలుగు, ఉత్తమగ్రంథములు, వెలువడును, ఈ గ్రంథమాలలోని ప్రతిపుస్తకము, భాషాసేవకుపకరించునని, వేరేచెప్పనక్కరలేకయే, ముందుముందు పాఠకులు గ్రహింపగలరు. ప్రతిసంవత్సరము, ప్రకటించునాలుగుగ్రంథములలో, ఒకనాటకము. ఒకప్రాచీనప్రబంధము (అముద్రితము) ఒకనవల ఒకవిమర్శనము(లేక దేశచరిత్రము). ప్రచురింపఁబడును. గ్రంథమాలలేఖకులు సమర్థులగుటచేతను. సంపాదకులు భాషాభిమానులగుటచేతను. ఇందనుపయోగమైన పొత్తము ప్రకటింపఁబడదు. సంవత్సరమునకు వలయునుద్గ్రంథములు, స్వీకరింపఁబడినవి. గ్రంథమాలా ప్రతిష్ఠాపకులు. స్వార్థత్యాగమొనర్చి, ఆంధ్రవాఙ్మయమునకిట్టి గ్రంథమాల లేదనిపింపవలెనని సిద్ధసంకల్పులైయున్నారు. శ్రీరాజావారి గ్రంథములుగూడ నియమానుసారముగ, నిందే ప్రచురింపఁబడును ఈగ్రంథమాల కనుబంధముగ, కృష్ణరాయ పుస్తకభాండాగారము. అనుపేరనొక లైబ్రరిని శ్రీరాజాగారు ప్రతిష్ఠించిరి. గ్రంథకర్తలు, తమపుస్తకములను బంపినయెడల విమర్శించి అభిప్రాయమొసంగుటయేగాక, అనుబంధ గ్రంథములలోఁగూడఁ బ్రకటింపఁబడును —

## గ్రంథమాల నియమములు.

1. ప్రవేశరుసుము లేదు. మా గ్రంథములన్నియుఁ గొనువారలే శాశ్వతచందాదారులు. ఇందు ప్రచురింపఁబడు గ్రంథములన్నియు అంచెకూలితోఁ గూడ 100 పుటలకు 0-6-0 చొప్పున శాశ్వతచందాదారులకును. ఇతరులకు 100 పుటలకు 0-8-0 చొ॥ (అంచెకూలిగాక) ఒసంగఁబడును.

2 చందాదారులకు అనుబంధ గ్రంథములన్నియు, నుచితముగ నొసంగబడును. ఇతరులకు సరియైనవిలువ. విధింపఁబడును మా ప్రచురణములలో నెంతగొప్పపుస్తకమైనను రు1-0-0 విలకు మించియుండదు.

3. సంవత్సరమునకొక, అముద్రిత ప్రాచీన ప్రబంధము. ప్రచురింపఁబడును (చక్కనికూర్పుతోడను. విపులమగు. పీఠికతోడను కఠినపదములకు టిప్పణముతోడను. అద్వితీయముగ ప్రబంధముండును.)

4. గ్రంథమాలకురాబడి, యెక్కువైనకొలది, గ్రంథములకు విలువతగ్గింపబడును. గ్రంథమాలవలనవచ్చు నాదాయము, ఛాపకొరకు. వెచ్చింపబడును చందాదారులసంఖ్య యెక్కువైనయెడల, మాసమునకొక, అనుబంధగ్రంథ మొసంగ బడును.

5. సరియగు మూలధనముతో స్థాపింపబడినదిగానఁ ఈ గ్రంథమాల శాశ్వతముగ నుండగలదు.

## ప్రచురణ గ్రంథములు.

### 1. సాధుసాపరాధవముచర్త్రితనాటకము

గ్రంథమాల ప్రతిష్ఠాపకులగు, శ్రీకృష్ణారావు బహద్దరుగారిచే రచియింపబడినది. కథ, విమలాదేవి. రాజసింహులవివాహము, చందాదారులకు పోస్టేజితో 0-9-0, ఇతరులకు పోస్టేజిగాక రు0-12-0. 1916 మార్చి నెలగుటకు తేదీని ప్రచురింపబడుగు,

2. సత్యభామాపరిణయము (ప్రాచీనప్రబంధము) ఈప్రబంధ రాజమును ఆంధ్రప్రపంచము, ఇంతవరకు ఎరుగదు రమారమి. 300 సంవత్సరముల క్రింద, పట్టాభిరామామాత్యకవిచే రచియింపబడినది ధారాశైలి, శ్లాఘనీయము భాషాసతికి ప్రబోధము! అమూల్యభూషణ మనవచ్చును జూలై నెలలో ప్రచురింపబడును.

3. స్వర్ణమేఖల, నవల (శ్రీకృష్ణరాయలవివాహకథ) ఈనవలలో, కాల్పనికశక్తియు, మేధాశక్తియు, గ్రంథకర్తలచే చక్కగ వినియోగింపబడినది, రచనచూడదగినది గ్రంథకర్తలు శేషాద్రిరమణకవులు, సెప్టెంబరు నెలలో ప్రచురింపబడును.

4. ఆంధ్రకవితాసర్వస్వము! విమర్శనము

ఆంధ్రభాషను, ఆంధ్రకావ్యములను గూర్చిన అమూల్యమగు విమర్శనము భాషాభిమానులు చూడదగినది, డిసెంబరు నెలలో ప్రచురింపబడును.

— చందా నియమములు —

అభిమానులు. సం॥ రు6 0 0

పోషకులు. సం॥ రు12-0-0

రాజపోషకుల చందా మీ

యనుగ్రహాధీనము.

విరునామా.—

శ్రీకృష్ణరాయ గ్రంథమాలా సంపాదకులు.

గింజలగూడెము.

తిరువూరు తాలూకా

కృష్ణాజిల్లా.

---

N B.— మా గ్రంథమాలలోని నాటకములు, నవలలు సాధ్యమైనంతవరకు మనదేశచరిత్రల ననుసరించియుండును.

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు

కాన మహర్షులు తమకన్యల కొకవేళ రజోదర్శనానంతరవివాహముల నాచరించియుం డినను మనల నావివాహములఁ జేయవలదని చెప్పియున్నారు కాన నవి (మహర్షులాచరించినవి) మన కగ్రాహ్యములగుచున్నవి మహర్షులు తాము చేసి యితరులఁ జేయవలదని చెప్పిన కర్మములలో మనకు మంచివిగాఁదోఁచినకర్మములను మనమనుష్ఠించిన దాన నేమి హానికల్గును? అనిశంకించెదరా? అటులేని రజస్వలావివాహములు మీకు మంచివని తోఁచినట్లయిన మాకుఁ జెడ్డవిగాఁదోఁచుచున్నవి కానవానిని మేమాచరింపకున్న దోషమేమని మేమడిగిన మనసోదరు లేమిచెప్పుదురు? వారుచెప్పునదియిది

"మీకు లోకజ్ఞానములేదు పరదేశసంఘములతో మనదేశసంఘముల కన్యోన్య సంపర్కము దినదినాభివృద్ధినందుచున్నది కొన్నియాచారములు మార్చుకొనకున్న స్వసంఘాభివృద్ధి గానేరదు కాన మేము చెప్పునవివాహసంస్కరణము సమ్మతింపవలసిన" దని చెప్పవత్తురు. అటులేని మహర్షులాచరించినకర్మములలో రజోదర్శనానంతర వివాహములు మనసోదరులలోఁ గొంతమందికి మంచివనితోఁచ మన కిష్టములేకపోయినను నాచరించవలసినదని నిరోధించుచున్నారు వాదమునిమిత్త మించుకసేపు రజస్వలావివాహములు వారియిష్టానుసారము మంచివని మన మంగీకరించినట్లు తలంచుకొందము తలంచినతోడనే మనసోదరులలోఁ గొందఱు బయలుదేరి మాంసాహారము మహోత్కృష్టకార్యమనితలంచి యదివిడుచుటం జేసియే బలహీనులమై స్వసంఘసంరక్షణము దసమర్థులమైతిమని చెప్పుచు మన మది నింద్యమనివాదించినయెడఁ బూర్వకాలమున నగస్త్యుఁ డొకమేకపోతుమాంసము నంతయు దానొక్కఁడే మెక్కినట్లు భారతమునందుఁ జెప్పఁబడియున్నదని చెప్పుదురు ఆకథ యబద్ధమనుటకు వీలులేదుకదా వారియిష్టానుసారము మనము మాంసాహారము నంగికరించవలయునా? అంగికరించితిమేని మఱికొందఱు సంస్కర్తలు బ్రాహ్మణక్షత్రియాదిజాతిభేదములను బాటింపక పరస్పరవివాహసంబంధములు గావింపుకొనుట సంఘక్షేమమనితలంచి పూర్వమున శుక్రుఁడు దేవయానిని యయాతికిచ్చినకథను వర్ణించి యన్యజాతిసంబంధమును జేయుమందురు చేయవలసినదేనా? చేసితిమనితలంచుదము ఇంకఁగొందఱుసంస్కర్తలు బయలువెడలి సురాపానముమంచిదనితలంచి పూర్వమున శుక్రుఁడు సుర సేవించినకథను వినిపించి మద్యపానము గావించుఁడందురు అదిమనము చేయఁదగినదేనా? తగినదని తలంతము మఱికొందఱుబుద్ధిమదగ్రగణ్యులు సంఘసంస్కారపరాయణులై మనసంఘమున సతికి బహుపతిత్వములేకుండుటచేతనే మనసంఘము క్షీణించుచున్నది పూర్వ

కాలమున ద్రౌపది నేవురుభర్తలు వివాహమాడుదురనిన ద్రుపదుండు సమ్మతింపని సమయమున ధర్మనందనుఁ డిట్లు చెప్పెను. «తొల్లి గౌతముండైన జటిలుండనుఋషి కూఁతురు తపఃప్రభావంబున నేడ్వురుఋషులకు నొక్కతె భార్యయయ్యెననియును, దాక్షాయణియనుమునికన్య ప్రచేతసులనంబరఁగిన పదుండ్రకు నొక్కతె భార్యయయ్యెనని యును గథలువినఁబడుచున్నవని చెప్పియున్నవాఁడు. ఇదిగాక దినదినము మనసంఘమున విధవలసంఖ్య వృద్ధినందుచున్నది కాన నొకసతికి నైదార్గురు నేడ్గురుపదుండ్రపతులను జేసినచో విధవాత్వము మనదేశమునుండి పరుగిడ మొదలిడుటయేకాక యీవిషయమై పలుశ్రమలఁబడుచున్న శ్రీ రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారి మహాపు రుషులైనున్న భారమును గొంతఁదగ్గించి వార్ధక్యదశలోనున్న శ్రీవారి కీరూపముగానైనఁ గొంతసహాయము జేసినవార మగుదుముకదా యని చెప్పవత్తురు. ఈబోధకు లోను గావలసినదేనా? లేకున్న "ద్విపాదపశువులారా! నీతిలేనిశుంఠలారా!» యని పత్రికా ముఖముల మనలఁబిలిచి చెప్పకమానరు. వెంటనే గౌరవనీయులు బయలుదేరి "అకార్డింగ్ టుది హిందూశాస్త్రాస్»అని చెప్పుచుఁ బైనఁజెప్పినవిషయములలో నొక్కొక్క దాని కొక్కొక్క శబ్దమునురచించి ప్రకటించి మించియూ వెంటనే యిప్పటిరజస్వలా వివాహశాసనమువలెనే మాంసాహారశాసనము, సంతశ్శాఖావివాహశాసనము, మద్య పానశాసనము, బహుపతిత్వశాసనము లోనగువానిని శాసననిర్మాణసభలో «మూ» చేయుచుందురు. అదిమొదలుకొని మనము «లాభస్తే పాంజయస్తే సాం» ప్రారంభించి కుర్యోమె ఖ్త్రీ యీశాసనములు మాసంఘమునకు హానికలిగించును గానఁ దొలఁగిం చుఁడని దొరతనమువారికి మొఱలంపుకొనుచుందుము. «చిచ్చాయిచిచ్చాయి, యనఁ గా సంబారెసంబారె» నన్నట్లు మన కృష్ణాంధ్రాదిపత్రికలకుఁ జందాదారులు వృద్ధి యయ్యెడిసమయ మిదియేకదా. పోరాటముప్రాయనిపత్రికలనుగొనుటకు జనుల కారా టముండదుకదా. వీనికేమి గాని

జ్యోతిశ్శాస్త్రమీరజస్వలావివాహముల సంగీకరించుచున్నదా?

యనియడిగెదరా? సూర్యచంద్రులకు ఋజాగతియుండగా జ్యోతిశ్శాస్త్ర మీవి షయము నంగీకరించదు. అంగీకరింపకపోఁగా రజస్వలావివాహములు పూర్వకాలమున లేనట్లు తెలుపుచున్నది. చూడుఁడు. కాలామృతము ప్రథమబిందువునందుఁ బ్రథ మాస్తవప్రకరణమున

«సంధ్యోత్ప్లవ సర్వపాతపరిఘా రిక్తాష్టమీద్వాదశీ
షష్టీవిష్టి విషావమాదిగివసా దుష్టర్క్ష సంస్థారవిః

రంధ్రేందు స్థితమోహభర్తరశుభా నో గానికా వైధృతిః
పాపాక్రాంతభమస్తపాపవసతిః కన్యార్తవే దోషకృత్॥"

ఇందు భర్తయొక్క జన్మలగ్నమునకు నెనిమిదవయింటఁ జంద్రుఁడుండగా భార్య రజస్వలయైనను, బెనిమిటిజన్మనక్షత్రమునకు నేడవనక్షత్రము సమర్తాడిననక్షత్రమైనను నార్తవదోషముకలుగుచున్నదని వర్ణింపఁబడియున్నది. పూర్వము వివాహముకానియెడల నేభర్తయొక్క జన్మలగ్నమున కెనిమిదవయింటఁ జంద్రుఁడుండగాసమర్తాడిన నార్తవదోషముకలుగును? అనిచెప్పవలయును; ఏభర్తయొక్క జన్మనక్షత్రమునకు నేడవనక్షత్రమందు సమర్తాడిన రజోదోషమువచ్చునని చెప్పవలయును? ఇంతియు గాదు.

ముహూర్త దర్పణము 105 పుటను పూర్వత్రయే యామ్యభుజంగధిష్ణ్యే తాంబూలతైలం కుసుమం హారిద్రాం, తద్భర్తృ సందర్శనమేవవర్జ్యం తాత్కాలికం శాంతివిధిం ప్రకుర్యాత్॥ పుబ్బపూర్వాషాఢ పూర్వాభాద్రానక్షత్రములందును, భరణ్యాశ్లేషానక్షత్రములయందును కన్య రజస్వలయైనఁ దాంబూలము, తైలాభ్యంజనము, పుష్పధారణము హారిద్రాలేపనము, భర్తృసందర్శనము వర్జించి తాత్కాలికముగ శాంతికర్మమును జేయవలసినది॥ అనియర్థము. ప్రథమరజస్వలయగుటకుఁ బూర్వము వివాహముకానియెడఁ బూర్వత్రయాది దుష్టనక్షత్రములందుఁ బుష్పవతియైనకన్య యీశ్లోకమందుఁ జెప్పఁబడినప్రకార మేభర్తసందర్శనము వర్జింపవలయును? ఉపభర్తృసందర్శనమునా? దీనినిమనసోదరు లంగీకరింతురా? అంగీకరింపరు. అటులేని జ్యోతిశ్శాస్త్రముసయితము సూర్యచంద్రులకు ఋజాగతియుండఁగా నీరజస్వలావివాహముల నంగీకరింపదని మనకు సాటింపవచ్చును. ప్రత్యక్షశాస్త్రములలో జ్యోతిశ్శాస్త్రము మనప్రతివాదులకుఁ బ్రతికూలముగానున్నదని యిదివఱకు నిరూపించియున్నవారము ఇపుడు వైద్యశాస్త్ర మీవిషయమై యేమిచెప్పుచున్నదో చర్చించుకొందము.

## సుశ్రుతము రజస్వలావివాహముల బోధించుచున్నదా?

బోధించుటలేదు. కాని త్రిలింగపత్రికాధిపతులు మొదలగుకొందఱు సుశ్రుతము రజస్వలావివాహములను బోధించుచున్నదని వ్రాయుచున్నారు. చూడుఁడు త్రిలింగపత్రిక సంపుటము2 సంచిక1 "ప్రౌఢావివాహములు," అనుశీర్షికక్రింద "మనవైద్యశాస్త్రప్రకారమును బూర్వవైద్యశాస్త్రప్రకారమును, ఆధునికవైద్యశాస్త్రప్రకారమును, కనీసము 16సంవత్సరములు రాకపూర్వము స్త్రీ తల్లియగుటకు అర్హురా

లు గాదేరవు. తండ్రికి ఇరువదియైదుసంవత్సరములును దల్లికి పదియాఱుసంవత్సరములును రాకముందు డింభోత్పత్తియయ్యెనేని శిశువు గర్భములోఁ జనిపోవును. బయటికివచ్చెనేని స్వల్పకాలములో మరణముఁ జెందును. జీవించెనేని యావజ్జీవము రోగముపాలైజీవించును. „ ఊనషోడశవర్షాయా మప్రాప్తః పంచవింశతిం యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థస్సవిపద్యతే జాతోవాన చిరంజీవేత్ జీవేద్వా దుర్బలేంద్రియః తస్మాదత్యంతబాల్యాయాం గర్భాధానం నకారయేత్ „ అని సుశ్రుతశారీరవాక్యముఁ బ్రమాణముగానిచ్చియున్నారు. ఈఘట్టమునందు వీరువ్రాసిన యీశ్లోకమునేకాక సుశ్రుతసూత్రస్థానములోని „పంచవింశే తతోవర్షే పుమాన్నారీతుషోడశే, సమత్వాగతవీర్యౌతౌ జానీయాత్కుశలోభిషక్ „ అనుశ్లోకమునుగూడ శ్రీదయానంద సరస్వతీస్వాములవారు సత్యార్థప్రకాశమునందును శ్రీమ దార్యనారాయణమూర్తిగారు 28-1-15 తేదిగల ఆంధ్రదినపత్రికను „వివాహవిభ్రమోచ్ఛేదన“ మునందును, గౌరవనీయులగు వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారు „మ్యారేజిఆఫ్టర్‌ప్యూబర్టీ„ (Marriage after puberty) యనుగ్రంథమున 78వపుటను బ్రమాణములుగా గ్రహించియున్నారు. ఈశ్లోకములను బ్రమాణములుగా గ్రహించుటలో వారియభిప్రాయమేమో బోధపడకున్నది? బాల్యమునందున్నపడఁతికి గర్భాధానముచేయఁగూడదని చెప్పెడివచనములఁజూపి బాల్యమునఁ గన్యలకు వివాహములఁజేయవలదనుచున్నారు. ఇదేమివింత. పెద్దపెద్దపేరులఁబెట్టుకొని సంఘసంస్కారులమని బయలుదేరి వివాహమునకును, గర్భాధానమునకును గలభేదమును దెలిసికొనకయే గ్రంథములరచించుటకును, వ్యాసములవ్రాయుటకును, గడంగుటఁజూడఁ జాల వ్యసనకరముగానున్నది. ఒకవేళ వివాహదీక్షలో నాలుగవదినమందు సూత్రమెఱుంగని మనపురోహితులు గర్భాధానసంస్కారము జరుపుటఁజూచి, దీనింబట్టి పూర్వకాలమున గర్భాధానము జరుగుచుండెడిదని తలంచి వివాహమునాఁటికిఁ గన్యరజస్వలయై యుండనియెడల నాలవనాఁటిరాత్రికిజరిగెడి గర్భాధానమున కర్హురాలుకాదనితలపోసి సుశ్రుతమునందు బాల్యమున గర్భాధానమునిషేధించెడి యీశ్లోకములను బ్రమాణములుగాఁ గొనియుందురా! అటులేని వివాహదీక్షయందు గర్భాధానసంస్కారము జరుపవలెనని యాపస్తంబాదిసూత్రములందుఁ జెప్పఁబడలేదనియు నట గర్భాధానఖండనము లోవలనున్న మూఁడుమంత్రములమాత్రమే జపింపవలయునని యున్నదనియు, ఇది తెలియనిపురోహితులు నాఁడుగ

ర్భాధానఖండన సేకరువు పెట్టుచున్నారనియు, దానిం గని మనసోదరులు గర్భాధాన మని భ్రాంతిపడి పూర్వకాలమున రజస్వలా వివాహములె జరుగుచుండెడివని వాదింప మొదలిడిరనియుఁ గాన నిది యనుచితము కాదనియు, మేమిదివఱకు "రజస్వలావివాహములు సూత్రానురోధములా?" యనుశీర్షిక క్రింద విశేషముగా విన్నవించియున్నాము. కాన సంశయముగలవారలు మరల జదువుకొందురు గాక!

వీరు తెలిసియో తెలియకయో రజస్వలావివాహములు మంచివని చెప్పి యామాటను నిలుపుకొనుటకై మంత్రముల కపార్థములఁ గల్పించియు స్మృతివచనములకు విరుద్ధాన్వయములఁ జేసియు, సూత్రములపై యుక్తివాదములఁ గావించియుఁ గొంతపోరాడియుఁ బూర్వాచారపరాయణులైన పండితులను మెప్పించలేక యిపుడు కాసుమనసు దిగి యిందునం గాని కృతార్థులము కామని యెంచి సుశ్రుతశారీరమందు వివాహమును బోధించుచున్న యీ "అథాస్మై పంచవింశతివర్షాయ ద్వాదశవర్షాం పత్నీ మావహేత్॥ "ధర్మార్థకామప్రజాః ప్రాప్స్యతీతి" అనుసూత్రమును మూసిపెట్టి చిన్నతనములో గర్భాధానముఁ జేయరాదను తరువాతి "ఊనషోడశవర్షాయా" యను ప్రమాణములను జూపి బాల్యవివాహములఁ జేయరాదని వాదించుచున్నారు. ఏమి! వీరి సాహసము! ఇరువదియైదు సంవత్సరములు కలవానికిఁ . పండ్రెండేండ్లభార్యను జేయవలసినది. వాఁడు పిత్ర్యధర్మార్థకామప్రజలను బొందుచున్నాఁడు. అని పైసూత్రార్థము. ఇట్లుండఁగా మనసోదరులు సంఘసంస్కారులమని బయలుదేరి స్వాభిమానపరులై శాస్త్రవిరుద్ధాచారమును సంఘమున నెలకొల్పిన యెడ దానివలనఁ గలిగెడిహాని సాంఘికులందఱు ననుభవింపవలయును గదా. ఆహానికి మూలకారకులు మనసంస్కారసోదరులగుటకు సంశయము లేదు. సంఘమునకు హానిఁ జేయువారు సంఘసంస్కారులని యెట్లనిపించుకొనఁగలరు? మనసోదరులీ రజస్వలావివాహముల నైదాఱింటిని జరిపిరో లేదో యపుడె యీయనాచారవిషవృక్షము సంఘనిర్మూలకవిషఫలములఁ గొన్నిటిని నొసంగియున్నది. ఈఫలములను నిండ "స్వయంవరవివాహములనుగూర్చి" వ్రాయుచోటఁ బ్రదర్శించియున్నవారము. అటఁ జూడఁగలరు. సుశ్రుతశారీరముపై "అథాస్మై పంచవింశవర్షాయ ద్వాదశవర్షాం పత్నీమావహేత్" అనుసూత్రముతో బాల్యవివాహముల బోధించుటయేకాక ప్రథమార్తవప్రకరణమందును గర్భాధానప్రకరణమునందును వానిని బలపఱచియున్నది. కానియీసుశ్రుతమును గడిగి గాలించినను రజస్వలావివాహమును బోధించెడివాక్యము మనకుఁ గన్పడనేరదు. చూడుఁడు శారీరస్థానము 19 వ పుట "దర్భసంస్తరశాయినీం కరతల

శరావపన్నాన్యతమభోజినీం హవిష్యం త్ర్యహం భర్తుః సంరక్షేత్॥ ఇందులకు హిందీ యనువాదము నిట ముందు వ్రాసి తెలుఁగర్థమును నిచ్చెదము "రజస్వలా స్త్రీకో తీన్ దిన్ తక్ శాకిసజ్జాపర్ సోనా, ఆవుర్ హాథేలీ యామిట్టీకె బర్తన్ యాపత్తోంకి పాతర్ ఇన్మేంసె కిసీ మెఁ రఖ్ కర్ హవిష్యాన్న (జోంచాంవల్ ఆది) అన్నఖానాచాహ్యే ఔర్ పురుషసే బహుత్ హీ బచారఖనా (దర్శన్ తక్ భీనహీకరానాచాహ్యే) అనఁగా దర్భశయ్యయందు శయనించినదియు హస్తమునందుఁగాని మూఁకుటియందుఁగాని యాకునందుఁగాని హవిష్యమును భుజించునదియు నగు కన్యను రజస్వలయైయున్న మూఁడుదినములు భర్తనుండి కాపాడవలసినది (భర్తృదర్శనముకూడఁ జేయరాదు) ఆర్యులారా! రజస్వలయైయున్న కన్నె కదివఱకు వివాహమే కానియెడ నా మూఁడుదినములు భర్తృదర్శనముగూడఁ జేయకుండునట్లు గాపాడవలసినదని సుశ్రుతము చెప్పియున్నదే! ఏభర్తనుజూడకుండ మన మాకన్యను గాపాడవలయును ? ఇదిచదివినపిదప నెవఁడైన సుశ్రుతము రజస్వలావివాహము బోధించునని కాని పూర్వకాలమున రజస్వలావివాహములున్నవని కాని వాదించుటకు సాహసించునా? ఇంతియగాదు. ఆవెంటనె "తతః శుద్ధస్నాతాం చతుర్థేహ న్యహతవాసస మలంకృతాం కృతమంగళస్వస్తివాచనాం భర్తారం దర్శయేత్, తత్ప్రస్య హేతోః" ఇందులకు హిందీ యనువాదము "ఫిల్ చాంథేదిన్ శుద్ధస్నానకరాకె అహతవస్త్రి (సాడీ) పహన్ కర్ ఆభూషణధారణకరాకె మంగళపాఠ, స్వస్తివాచనకరాకె వైద్య, భర్తాకాదర్శన్ కరావె ఇస్కా కారణ్ క్యాహై" అనఁగా రజస్వలయైనకన్య నాల్గవదినమున శుద్ధస్నానముచేసి శుద్ధవస్త్రాభరణాదుల ధరించి చేయఁబడిన మంగళపాఠస్వస్తివాచనము కలదై యున్నపిదప నాకన్యకు భర్తనుఁ జూపింపవలసినది. కారణమేమనఁగా" అని సుశ్రుతము జెప్పి ప్రశ్నించుచున్నది ఇందు రజస్వలయైనకన్య నాల్గవదినమున శుద్ధస్నానముచేసి యలంకృతయై భర్తను దర్శించవలయునని కలదుకదా. కన్యకు రజస్వలయగు నాఁటికి వివాహమే కానియెడ నాల్గవదినమున నేభర్తను దర్శించవలెను? కన్యల కిప్పుడు రజస్వలలుకాకముందే వివాహము చేయుట చాలమంచిది. వారు ప్రథమరజస్వలలై యామూఁడుదినములు పురుషసందర్శనము లేక యుండి స్నానముచేసి యానాఁడు భర్తృసందర్శనము చేయవలయునని మనసుశ్రుతము చెప్పినమాట వింటిరికదా. నాఁటిదినమున నెటువంటి పురుషుని వారుకాంతురో యటువంటి పుత్రులను గాంతురని మనశాస్త్రములు నొక్కి చెప్పుచున్నవి. స్త్రీలు రజస్వలలై యున్నప్పుడు వారిమానసమును గామము మిగుల బాధించుచుండును

అందువలనఁ బురుషునిఁగాంచిన మానసికవ్యభిచారము తప్పక కలుగును. దానివలన నాపెయందుఁగలిగినసంతానమునకు నపవిత్రత కల్గును. పురుషునిమానసికవ్యభిచార మటువంటిదికాదు. దానివలనఁగలిగెడునష్ట మతఁడొక్కఁడేపొందును. స్త్రీమానసిక వ్యభిచార మాపెసంతతికిఁ గళంకముఁగల్గించును. అది యంతటితో నంతరించక తరతరముల వచ్చుచుండును. ఈవిషయమునుగూర్చి యిందే "స్త్రీసంరక్షణ" మనుశీర్షికక్రింద విపులముగా విన్నవించియున్నవారము. ముందటఁ జదువఁగలరు. స్త్రీ మానసికవ్యభిచారము సంతానము గళంకితముఁజేయుననుటకు నొక చిన్న కథకలదు. దానినివినిపించెదము వినుఁడు. తొల్లి నొకబ్రాహ్మణయిల్లాలు రజస్వలయై శాస్త్రవిధిననుసరించి యామూడుదినములును బురుషసందర్శనమునుమాని నాలవనాఁట యుదయమున స్నానమొనర్చి తలఁదుడిచికొని పతిదర్శనము గావింప నుద్యుక్తయైయున్నతఱి నాయింటి పెరటివెనుకనున్న చిన్నవీధిని నొక కడజాతివాఁడు పోవుచు నాయన్నులమిన్నకుఁ గనుపించెనఁట! వానింగని యాసాధ్వీమణి పతిదర్శనమునకు ముందుఁ బరపురుషదర్శనమయ్యెనని వ్యసనమునుబొందియుఁ జేయునదిలేక యూరకుండెనఁట. దైవగతి నామానవతి కామాసమున గర్భమై యది క్రమముగా నభివృద్ధిఁజెంది మతిమంతుఁడగుసుతుఁడుదయించెనఁట. పిదప నాదంపతు లాబాలునికి గర్భాష్టమమున నుపనయనము గావించి గురుకులవాసమున కంపిరఁట! పిదప నాతఁడు సకలవేదవేదాంగములను బఠించి జంతుభాషలనుగూడ గ్రహించి గురుదక్షిణనుసంపాదింప గురుననుమతివడసి యొకభూపాలుని దర్శింపఁబోవుచు రాజవీధి నరుగునవసరమున ఖర మొకపైపునను దానిపిల్ల మఱియొక ప్రక్కను నుండుటనుగని తాను ద్విజుఁడుకావున వానినడుమఁ బోనొల్లక యొక చిన్న తాటినిఁగొని యాపిల్లను బెదరించిన నది తల్లికడకుఁబోవఁ దానాప్రక్కనుండిపోవచ్చు ననియెంచి యట్లుచేయ నాతనిచేతినుండి యాతాటిజాఱి గాడిదపిల్లపైఁ బడెనఁట. చప్పున నది తనతల్లికడకుఁజని బ్రాహ్మణుఁడు తనను తాటితోఁగొట్టినాఁడని వినిపించి విలపింపఁ దల్లి యాపిల్లతో నిట్లనెనఁట. "అమ్మా! బ్రాహ్మణుఁ డెప్పుడును గాడిదెను తాటితోఁగూడఁ గొట్టఁజనదు. కాన నితఁడు బ్రహ్మణుఁడుకాఁడు. చండాలాంశ సంభూతుఁడు. కావున నె నిన్నుఁ గొట్టియున్నవాఁడని యోదార్చెనఁట. ఆబ్రాహ్మణుఁడు జంతుభాష నెఱిగినవాఁడుకావున నదివిని తనజననస్థితినిఁ దలపోసి ముందునకుఁబోనొల్లక తనయింటికరుగుదెంచి వ్యసనముతో ముసుఁగువెట్టుకొని పరుండియుండెనఁట. అంతట నాబాలునిజనని చాలదినములకువచ్చిన తనతనయుని గనుఁగొని

ముదయమున నన్నపానీయాదు లమర్చి భుజింపరమ్మనిపిలువ నాకు భోజనంబువలదని ప్రత్యుత్తరమిచ్చెనఁట. అదేమని తల్లి గ్రుచ్చిగ్రుచ్చియడుగ నపు డాబాలుఁ డిట్లు చెప్పఁదొడఁగెనఁట. అమ్మా! నిన్నడుగరానివిషయ మొకటి యడుగవలసివచ్చినది. దానికి నీ వలుగక ప్రత్యుత్తరమిచ్చెదవేని భుజించెద, లేకున్న భుజింపనని చెప్పెనఁట. అదివిని తనయా! నీకుఁ జెప్పరానిదొకటియుండునా? అదియేదైనను దాపక చెప్పెద నడుగుమనెనఁట. అపుడాతనయుండు సంతసించి తల్లీ! పరమపతివ్రతాశిరోమణివని నమ్మియున్న నేను నిన్న నిన్నుగూర్చి ఖరముపలికినపలుకునువిని విచారసాగరమున మునిఁగి యిందలి యాథార్థ్యమును దెలియఁగోరివచ్చితినని యాకథను (సకృత్స్నా)ముగా వినిపించెనఁట. అదివిని యాపతివ్రతాశిరోమణి తనయా! నీవు తలఁచినట్లు నేను పతివ్రతనేకాని నాకడుపునఁబడినమాసమున ఋతుమతినై స్నానముఁజేసి నీజననమునిదర్శింప నున్న నాకుఁ గడజాతివాఁడొకఁడు కనుపడెను. దాన మానసవ్యభిచారము సంభవించినది. అందున నీజననమునకుఁ గొంత కళంక మేర్పడినది. ఇందులకు వేదమందుఁ జెప్పినప్రాయశ్చిత్తమును జేసికొనుము. చేసికొనిన నది తొలఁగిపోవును. లేకున్న నాదోషము పుత్రపౌత్రపారంపర్యముగాఁ గూడియుండునుగాని విడిచిపోనేరదు. పిదప నాతఁడు తల్లి యానతిఁ బ్రాయశ్చిత్తముఁ జేసికొని పవిత్రుఁడయ్యెనఁట ఈప్రాయశ్చిత్తవిషయముఁ గూర్చి స్త్రీసంరక్షణమను దానిక్రింద విపులముగాఁ బ్రతిపాదింపఁబడియున్నది. కాన నటఁ బఠించుదురుగాక.

ఈకథనువినిన మనసోదరులు వెంటనే గాడిదెమాటలను మనుష్యుఁడు తెలిసికొనినాఁడనుకథను బుద్ధివిహీను (నాన్సెన్సు)లగు పూర్వాచారపరాయణులు నమ్మిన నమ్ముదురేమోకాని యింత యింగ్లీషుభాషా సంస్కారమునుబొంది సంస్కారులై యున్నవా రెన్నటికిని విశ్వసింపరని యనకమానరు. కాన వారికివిశ్వాసముకలుగుటకై యిటువంటి యాంగ్లేయ దంపతీకథావృత్తము నొసంగి వీనులకు విందుఁగావించెదము.

శ్రీయుత సర్-టి-ముత్తుస్వామి అయ్యర్ గారు చెన్నరాజధాని ప్రధానన్యాయస్థానాధిపతులుగానున్నప్పు డొక తెల్లదొరసానికి నల్లనిసుతుఁ డుదయించెనఁట. ఆపిల్లవానినిగని తెల్లదొరగారు తనసతీమణియెడ సంశయమునుబొంది భార్యను బరిత్యజించిరఁట. ఏదోషమెఱుంగని యాసతీతిలకము పతివియోగమునకు దుఃఖించియున్న తన్న్యాయాధిపులకడఁ దనను దనపతి గ్రహించునట్లుచేయుఁడని యభియో

గపత్రిము నివేదించెనఁట. ఆయభియోగమును విచారింపవలసిన న్యాయాధిపులలో నొకరుగా శ్రీముత్తుస్వామయ్యర్ గా రేర్పడిరఁట. శ్రీవా రాదొరగారి భృత్యులన ప్రత్యేకముగా విచారించి యాసాధ్వీమణియందు జారత్వములేదని తెలిసికొనియు బాలుఁడు దొరగారి పత్నియునఁ జాలినంత సామ్యముండుటచే నేమియుఁ జేయ నేరక తాము హిందువులుకాన సతీపతివియోగమును దీర్మానింపనొల్లక మిక్కిలి యోజించి సంతానోత్పత్తిశాస్త్రములను (సుశ్రుతశారీరస్థానాదులను) జూచి కారణమును గనిపెట్టి దొరగారినిరప్పించుకొని మీ సదనమునుజూడవలయునని కోరిక గలదు. చూపింపుఁడనికోరి యందులకువారు సమ్మతింప నటకరిగి శయనాగారమున శయ్యకు నెదురుగ గోడపైనమర్పఁబడియున్న సిద్ధిదంపతుల పెద్ద ఛాయాపటములను గని కారణముఁగనిపెట్టితినని సంతసించి న్యాయస్థానమునకుఁవచ్చి "మీసతీతిలకము పతివ్రతాశిరోమణియనియు, సుతుఁడు నల్లవాఁడుగన దయించుటకు మీరుసంశయించినకారణము కాదనియు మా వైద్యశాస్త్రములందుఁజెప్పఁబడినట్లు ఋతుకాలమున నీయమ సిద్ధివానివిగ్రహమును గనుగొనుటయేయనియు నీ మెనుగ్రహించుట ధర్మమనియు సప్రమాణముగను సయుక్తికముగను దీర్పుచేయ నాదంపతులు పరమామోదముంబొంది పూర్వమువలె జీవితకాలమును సుఖముగ గడపిరనుకథను సంపన్నగృహస్థునివలన విని మే మిద్దాని వినిపించినపుడెల్ల వినిన పలువురు దాక్షిణాత్యులు సంపన్నగృహస్థులు తథ్యమని చెప్పుచువచ్చిరి. ఈకథాంశములను స్థిరీకరించుచున్న సుశ్రుతములోని యీదిగువనుదాహరించిన శ్లోకము మీరుపఠింతురేని మీహృదయములో నేమూలనైన సందేహమున్న నది నివారింపఁగలదు. ఇదివినుఁడు. "పూర్వం పశ్యే దృతుస్నాతా యాదృశంనరమంగనా, తాదృశంజనయేత్పుత్రం భర్తారందర్శయేదతః" ఋతుస్నానముచేసినకన్య యెటువంటినరుని ముందుగఁ జూచునో యటువంటిపుత్రునిఁ గనుచున్నది. కాన నీకారణమువలన భర్తను ముందుగాఁ జూడవలసినది, అనిచెప్పియున్నది. కన్య రజస్వలయగుటకుఁ బూర్వము వివాహముకానియెడ నేభర్తనుజూచి యటువంటిపుత్రునిఁగను నని సుశ్రుతముచెప్పినది?

ఇఁక గర్భాధాన ప్రకరణమం దేమిచెప్పఁబడియున్నదో చూతము లఘ్వాశ్వలాయనస్మృతి 153వపుట "గర్భాధానం ద్విజఃకుర్యాదృతౌ ప్రథమఏవహి, చతుర్థదివసాదూర్ధ్వం పుత్రార్థీ దివసేసమే" అనఁగా ద్విజుఁడు ప్రథమర్తువునందే నాల్గవదినముతరువాత బుత్రార్థియగునేని సమదినములయందు గర్భాధానముఁజేయవలసినది" అనిచెప్పియున్నది. ఇందుఁ బ్రథమర్తువునందె గర్భాధానము చేసికొనవలసినదని చెప్పఁబడియు

న్నది. సుశ్రుతము ప్రథమర్తువైన తరువాత భార్యాభర్తలు నెలగినయులు దిగువఁ జెప్పి
నవిధానము ననుసరించి బ్రహ్మచర్యమును నడిపి యావెంటనె గర్భాధానముచేసికొనవలెన
నని పలుకుచున్నది చూడుఁడు శారీరస్థానము 20వపుట «తతోపరాహ్ణే» పుమాన్
మాసంబ్రహ్మచారీ సర్పిస్స్నిగ్ధః సర్పిఃక్షీరాభ్యాం శాల్యోదనం భుక్త్వామాసం బ్రహ్మ
చారిణీం తైలస్నిగ్ధాం తైలమాషోత్తరాహారాం నారీ ముపేయాద్రాత్రౌ"

సామాదిభిర్విశ్వాస్య వికల్ప్యవ్యసనం చతుర్థ్యాం షష్ఠ్యా మష్టమ్యాం దశమ్యాం ద్వా
దశ్యాం చోపేయాదితి పుత్రకామః" అనఁగాఁబుత్రేష్టిచేసికొనినతరువాత నపరాహ్ణకా
లమున నొకమాసము బ్రహ్మచర్యవ్రతమును బూనినవాఁడై ఘృతాక్తశరీరుఁడగుచు
ఘృతక్షీరములతోఁగూడిన శాల్యన్నమును భుజించి తనవలెనె మాసము బ్రహ్మచర్యవ్రత
మూనినదియుఁ దైలాభ్యక్తతనువుగలదియుఁ దైలమాషోత్తరాహారయు నగు నారీమణిని
రాత్రియందు నాలుగాఱెనిమిదిపదిపండ్రెండుపదునాలుగుపదునాఱులోనగుసరిదినముల
యందుఁబుత్రార్థియగువాఁడు గూడవలయును. అనియర్థము అయ్యలారా! ఋతుమతియ
గుటకుఁబూర్వమె వివాహముకానియెడ ఋతుస్నాతయైనసతితోఁ బుత్రకామేష్టిచేసికొని
యపరాహ్ణమునమాసము బ్రహ్మచర్యవ్రతమును బూనియటుపైసరిదినములందుఁ బుత్రా
ర్థియగువాఁడు గర్భాధానముచేసికొనవలసిన దేభర్త? శివశివా! ఇదెక్కడివాదము. మను
స్మృతివలెనె సుశ్రుతమును బాలికకుఁ బండ్రెండేండ్లలోపలనె వివాహముచేయవలసి ద
నిచెప్పి యది రజస్వలయగుటకుఁ బూర్వమెయని ప్రథమార్తవగర్భాధానప్రకరణము
లతో నిరూపించియున్నది. ఇట్లుండఁగా మనసోదరులు "తానుపట్టినకుందేటికి మూడే
కాళ్లు" అన్నట్లు పూనినవివాహసంస్కరణమును నెట్లైన నెగ్గించుకొనవలయునని
యెంచి బాల్యమున గర్భాధానమును నిషేధించెడి వచనములనుజూపి యావచనమునకు
వెనుకనున్న బాల్యవివాహబోధకవాక్యములనుజూపకయె సుశ్రుతము బాల్యవివాహము
లను నిషేధించుచున్నదని చెప్పుచున్నారు. ఇంతకంటె వంచనకార్యము మఱియొకటి
యుండునా? దీనింబట్టి పూర్వాచారపరాయణులలోని యశ్రుతుఁడగువాఁడు సుశ్రుతము
రజస్వలావివాహములబోధించుచున్నదని విశ్వసించునుకాని మఱియొకఁడు నమ్మఁజాలఁడు.

## కాలానుసారముగా వేదశాస్త్రములను బరివర్తనము చేయరాదా?

ఏకాలముననో యేకాలమునకుఁదగినట్లుగనో యెవ్వరిచేతనో వ్రాయఁబడిన మీ
రింతవఱకుఁజెప్పిన శ్రుతిస్మృతిపురాణేతిహాసాదిగ్రంథములను నీయిరువదవశతాబ్దమునవిదే
శీయ సంపర్కముకలిగినతరువాతఁగూడఁ బ్రమాణములుగాఁ బెట్టుకొని కాలానుసారముగా
నాచారములమార్చుకొనుట కిష్టపడక తాతలనాఁటియాచారములనె యాచరింపవలెఁ గాని

నవీనాచారములుకూడవని పట్టుఁబట్టుట యుచితముకాదని కొందఱుబుద్ధిమంతులు చెప్పుచున్నారు. కాని వీరు చెప్పునట్లు శ్రుతిస్మృత్యాదులనుమార్చుటవలనుగాదు. అందు శ్రుతులనుగూర్చి పరాశరమహర్షి యిట్లుచెప్పియున్నవాఁడు. "నకశ్చిద్వేదకర్తాచ వేదంశ్రుత్వా చతుర్ముఖః, తథైవ ధర్మాన్ స్మరతి మనుఃకల్పాంతరేంతరే॥ వేదమునకుఁ గర్త యొకఁడును లేడు. ఆవేదమును బ్రహ్మవిని యతఁడు మనువునకును జెప్పెను. అట్లె పరంపరగ వచ్చుచున్నది. మనువు ప్రతికల్పమునందును వేదధర్మములను స్మరించుచున్నాఁడు. అనిచెప్పుటచే వేదవేద్యుఁడగు పరమేశ్వరునివలె వేదమును త్రైకాలికాబాధ్యమై నిత్యమై యున్నదని విశదమగుచున్నది! ఈశ్వరునికి మార్పుకలిగిననాఁడె వేదములకును మార్పుగలుగును. కాన దీనివలన వేదము లపౌరుషేయములని తేలినది. ఈవిషయము బలపఱచుచున్న శ్రీవివేకానందస్వాములవారి వాక్యములను ప్రబుద్ధభారతసంపుటము 18 సంచిక 198 జనవరి 1913 దానిలోనుండి వ్రాయుచున్నారము. "Unpublished notes of a lecture delivered by the Swami VVivekananda at the unitarian church February 28th 1900. "The vedas are in fact, the oldest sacred books in the world. Nobody knows anything about the when they were written or by whom.................The religion of the vedas is religion of the Hindus, and the foundation of all oriental religions, that is all other oriental religions are offshoots of the vedas; all eastern systems of religions have the vedas as authority,, దీనివలన వేదములు జగత్తులోపల మిక్కిలి ప్రాచీనములనియు పవిత్రములనియు నివి యెవరివలన రచింపఁబడినసంగతిగాని యేకాలమునఁబుట్టినసంగతిగాని తెలియదనియు హిందూమతములన్నియు వేదమూలములనియు, నేష్యాఖండవాసులకుఁగూడ నివియే ప్రధానములనియు ప్రమాణములనియుఁ దెలియుచున్నది. మఱియు వేదములోనిమతమె హిందూమతమనిగూడఁ దెలియవచ్చినది. ఇట్లె ఖండాంతరపండితులును వ్రాసియున్నారు. దీనింబట్టి శ్రుతులనుమార్చుటకు మన మెన్నటికినధికారులముకామని తెలియవచ్చినది శ్రుత్యర్థప్రతిపాదకములు స్మృతులు, కాన శ్రుతులవలెనే వీనికినిమార్పుఁజెందెడియవస్థ లేదు ఈవిషయమయి పరాశరమాధవీయమునందు రెండవపుటను "శ్రుతింప

శ్యంతిమునయః స్మరంతిచ తథాస్మృతిం, తస్మాత్ప్రమాణముభయం ప్రమాణైః ప్రమితంభువి, యోవమన్యేత తేతూభే హేతుశాస్త్రాశ్రయాన్నరః ససాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః'' అనఁగా మునులు శ్రుతినిఁగని స్మరించుటచే స్మృతియగుచున్నది. అందువలన రెండును ప్రామాణికులచేఁ బ్రమాణముగా నిర్ణయింపఁబడినవి ఆరెంటి నెవమన్యించు తర్కశాస్త్రము ననుసరించి నిరసించునో వాఁడు పండితులచె బహిష్కరింపఁదగినవాఁడు నాస్తికుఁడు, వేదనిందకుఁడు నగుచున్నాఁడు కాఁబట్టి శ్రుతులవలెనె స్మృతులును బ్రభుసమ్మతములై మార్పుటకువీలులేని ప్రమాణములగుచున్నవి. ఇదిగాక స్మృతికర్తలు తమస్మృతులందు శ్రుతివిరుద్ధములగు విషయము లుండెననియు నుండిన నవి ప్రమాణములు గావనియు వారె ప్రతిజ్ఞాపూర్వకముగాఁ దెల్పియున్నారు. కాన శ్రుతివిరుద్ధవచనములుస్మృతులందుఁగనఁబడిన వానినిగదా మనము మార్చుకొనవలసినది. లేనియెడల మార్చుకొనవలసిన యవసరమేమి? శ్రుతివిరుద్ధస్మృతివచనములను మనకుఁ గనఁబఱచియున్నారా? లేదు. కాన ననియుఁ బ్రమాణములె. శ్రుతిస్మృతుల కనుకూలములుగానున్న సూత్రములు పురాణములు నితిహాసములు వేయేల! మనసంఘసంస్కారులు చెప్పెడివాక్యములుగూడ మనకుఁ బ్రబలప్రమాణములగుచున్నవి. ఇందులకు సందియములేదు. ఇట్లుచెప్పఁగానె మీరుచెప్పినరీతిగా శ్రుతులు బ్రహ్మముఖోద్భవములనితలంచెడి పిచ్చికాలము మారిపోయినది. ఆయాకాలములకుఁ దగినట్లుగవ్రాసిన శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాసగ్రంథముల నమ్మెడివాఁ డీకాలమునఁ గానరాఁడుకాన వానినెల్ల నొకమూలఁబెట్టి ప్రకృతకాలానుసారముగా ధర్మములు మార్చుకొనక తప్పదనియు, లేకున్న సంఘము నశించుననియుఁ గొందఱుధీమంతులు వాదించుచున్నారు. వాదమునిమిత్తము వారియిష్టానుసారముగా శ్రుతిస్మృత్యాదిగ్రంథముల నొకమూలఁ ద్రోసివేసితిమని యనుకొందము. నాశనోన్ముఖమైన సంఘము నుద్ధరించుకొనుటకు మన మెవరివాక్యములననుసరించి నడువవలయుననియడిగిన? మనసోదరు లేమిచెప్పఁగలరు? ఒకరు చెప్పినట్లు మనము నడువనేల? మన కీశ్వరుఁడు బుద్ధినిచ్చియుండలేదా! ఆబుద్ధితో నుచితానుచితకార్యములను యోజించి యుచితకార్యముల నవలంబించి యనుచితకార్యములఁ బరిత్యజించిన సంఘము బాగుపడునని చెప్పుదురా? అటులేనిఁ బూర్వాచారపరాయణులకును నవీనాచారపరాయణులకును భగవంతుఁడు బుద్ధినిబ్రసాదించియున్నవాఁడు, అం దెవరిబుద్ధికి మంచివని తోఁచినమాటలను వారు చెప్పుచుందురుకదా అప్పు డెవరివచనముల ననుసరించి నడువవలయును? మేము సంఘమునుజక్కఁజేయువారము గాన మామాటలు పాటించవలసినదని

సంస్కారులు చెప్పితీరుదురు ఆవెంటనె పూర్వాచారపరాయణులును మేమే సంఘము నెక్కఁబెట్టుకొనువారము మీరుకారు మామాటలె మీరు పాటించవలసినదని చెప్పఁజొత్తురు. అపు డెవరిమాటలననుసరించి సంఘము ప్రవర్తింపవలయును? అధికజనాభిప్రాయముననుసరించి సంఘము నడువవలయునని చెప్పుదురా? అటులైన మనసోదరులు పూనియున్న వివాహాదిసంస్కరణములకుఁ బునరావృత్తిరహిత శాశ్వతసుఖనివాసమగు పరమపదమె గతియని మనము చెప్పవచ్చును, అదేమన? ఇపుడు రజస్వలావివాహములుచితములనివచ్చెడితీర్మానములు నూటికి రెండును (ఇవియు సంశయములె) నవి కూడదనివచ్చెడితీర్మానములు నూటికి 98 యును నైయున్నవి. దీనింబట్టి సంఘసంస్కారులు పూనిన సంస్కరణములకు నధికజనాభిప్రాయ మెపుడు లభించును? ఎన్నడు సనాతనములైన శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాసాదిప్రమాణగ్రంథములపతనము మనసంఘమున స్వరూపనాశనముఁ బొందునో యానాఁడు మనసోదరులకధికజనాభిప్రాయము లభించును. అంతవఱకు లేదు.

## సంస్కర్తలు రజస్వలావివాహములు యుక్తియుక్తములని సాధించిరా?

ఆదిమాత్ర మనుమానమె. కాని వారు ప్రతివాదమునకును యుక్తియె ప్రధానముగాఁబెట్టుకొని వాదించుచున్నారు. ఈవిషయము చాలవఱకు నిరూపింపఁబడియున్నది. ఈయుక్తివాదములను వాదించువారు పలువురుగలరు. వారిలో నెవరెవరివాదములు విమర్శార్హములుగా మాకుఁదోఁచినవో వారివారివచనముల నిందుఁ బొందుపఱచి క్రమముగా విమర్శించుచున్నవారము. బందరు జాతీయకళాశాలాసంస్థలో పాధ్యాయులుగా నుండి ప్రస్తుతము కీర్తిశేషులైయున్న విద్వాన్ పెద్దింటి నరసింహాచార్యులుగారు, ఆంధ్రభారతియను మాసపత్రికారాజమున రజస్వలావివాహముంగూర్చి యొకదీర్ఘవ్యాసము వ్రాయుచు నందు వారు కొంత యుక్తివాదమును నెక్కించియున్నారు. ఆవాదమునె పలువురు వాదించుచుందురు. వారు తమయుక్తివాదమునకు ముఖబలముగాఁ బరాశరస్మృతిలోని "అష్టవర్షాభవేద్గౌరీ, నవవర్షాతురోహిణీ, దశవర్షాభవేత్కన్యా, అతఊర్ధ్వంరజస్వలా" యనువచనమునుగ్రహించి యర్థము వ్రాయునపుడు మొదటివాదమునుమాత్రము గ్రహించి యందు "గౌరీ" యనుశబ్దమునకు మాఱుగ "గన్యా" యనుశబ్దమును జేర్చి దాని కిట్లువ్యాఖ్యానముఁ జేయఁగడంగిరి. "అష్టవర్షాభవేత్కన్యా" పదియేండ్ల పడుచుకన్యయగుచున్నది అనియర్థము వ్రాయు మొదలిడిరి "అష్టవర్షా" యనగా నెనిమిదేండ్లదని చెప్పవలయును గాని పదియేండ్లపడుచని యెట్లర్థము చేయనగునని ప్రశ్నింతురాయ

నిశంకించుకొని దానికిసమాధానము సంస్కృతవ్యాకరణమందు నేకశేషవృత్తియనునది యొకటి కలదనియు దానింబట్టి మన మెన్ని శబ్దములను బెట్టుకొనినను వృత్తియం దొకటి మాత్రమె మిగులును కాన „అష్టవర్ష,, యనుపదమునకు విగ్రహ మిట్లు గావింపవలెను. అష్టౌ అష్టౌ వర్షాణి యస్యాస్సా అష్టవర్షా, అష్టయనుపదము రెండుసారులు పెట్టుకొని వృత్తిఁజేసినపుడు „అష్ట,, యను నొకపదముమాత్రమే మిగులునుగాని రెండుసారులు పెట్టుకొనినందున నాపదమునకుఁ బదియాఱనునర్థము చెప్పవచ్చునని యుఁ జెప్పి „యష్టవర్ష,, యనఁగాఁ బదియాఱేండ్లపడుచని యర్థమును జెప్పియున్నారు. ఏకశేషము ద్వంద్వాపవాదమయియున్నది. ఏకాది నవాంతసంఖ్యావాచకపదములకు ద్వంద్వసమాసము తటస్థింపదు, ద్వంద్వసమాసము నామములకు మాత్రమె వచ్చును. అదెట్లన? రాముఁడను నామముకలవారు నూర్వురు కలరని తలంచుకొందము. అపుడా నూర్వురనామములను „రామః, రామః,, యని వరుసగాఁబెట్టుకొనుచుఁబోయి చివరకు వానికిద్వంద్వసమాసముఁజేయఁగా నపు డేకశేషవృత్తి వచ్చి „రామాః,, యను నొకపదమునుమాత్రమే మిగులును. ఆట్లొకటిమిగిలినను దానికి నూర్వురు రాములను నర్థము చెప్పఁదగును. ఇట „అష్ట,, యనుపదము సంఖ్యావాచకము. ఈపదమును వినినతోడనే యిది యెనిమిదిపదార్థములఁ దెల్పుచున్నదను వ్యక్తి కలుగును. దీనికి ద్వంద్వసమాసము రాదు అదిలేనప్పు డేకశేషవృత్తి రానేరదు. కావుననే కవికులప్రహర్షుఁడగు శ్రీహర్షమహాకవి తననైషధమున „నవద్వయద్వీపపృథగ్జయశ్రియాం,, అని వ్రాసియున్నాఁడు. „నవద్వీపపృథగ్జయశ్రియాం,, అని వ్రాయలేదు. కారణమేమి? „నవ" యనుశబ్దమున కేకశేషవృత్తిరాకుండుటచేతనే „ద్వయ,, శబ్దమునుపయోగించి „నవద్వయద్వీప,, యని వాడియున్నాఁడు- లేకున్న నధికపదదోషము సంభవింపదా! కాన „అష్టవర్ష'' యనుపదమునకు నేకశేషవృత్తి చెప్పుట శాస్త్రవిరుద్ధమని తేలినది. వాదమునిమిత్తము వారు చెప్పిన ట్లంగీకరించినయెడ „అష్టవర్ష,, యనుపదమునకు విగ్రహము. „అష్టౌ అష్టౌ,, యని రెండుసారులుమాత్రమె పెట్టుకొని యీ యేకశేషవృత్తిఁ జేయ నేల? వారియిష్టము కన్యకకుఁ బదియాఱేండ్లకు వివాహము చేయవలయుననియుండుటం బట్టియా! ఆటులేని మఱియొకసంస్కారిగారు, ఈ„యష్ట'' యనుపదమును బండ్రెండుసారులు పెట్టుకొని యేకశేషవృత్తినిఁజేసి „అష్టవర్షభవేత్కన్యా,, అనఁగాఁదొంబదియాఱేండ్లకన్యయను నర్థమువచ్చును కానఁ దొంబదియాఱేండ్లపడుచునకె వివాహము గావింపవలెను అని వాదింప మొదలిడును ఇదేమి! తొంబదియాఱేండ్లవృద్ధస్త్రీకిఁ

గన్యాశబ్దమువాడవచ్చునా యని మన మాసంస్కారితోఁ బోరాడఁబోతిమా వారు వెంటనె పరాశరమాధవీయము 112వపుటలో శ్రీమాధవాచార్యులవారు చెప్పిన «శాస్త్రేషు బహవః కన్యాశబ్దాః అనుగృహీతాః భవన్తి, తథా చానుశాసనికే ప్రావక్రోపాఖ్యానే వృద్ధస్త్రీయాం ప్రయుక్తః» అనియు «శల్యపర్వణ్యపి వృద్ధస్త్రీయాం నారదేన ప్రయుక్త,» అనియు వ్రాసియున్నారు. కొన వృద్ధస్త్రీలయందుఁ గన్యాశబ్దము బాహాటముగా వాడఁబడియున్నది. కాఁబట్టి తోంబదియో డెందేండ్లపడుచుకే వివాహముచేయవలయునని పట్టుఁబట్టుదురు. మొండికివేసి మనమావాదమును వినకుంటిమా ఛీ, నీతిలేనిశుంఠలారా! ద్విపాదపశువులారా! మామాటవిని «బుడ్డీచోద్రాబ్రహ్మణులుకండని యుపదేశింతురు. అప్పటికి విననైతిమా అకార్డింగ్ టు దిహిందూశాస్త్రీసు'' అని «వృద్ధస్త్రీవివాహము» అను గ్రంథమును బ్రకటించి మన గౌరవనీయులు వెంటనె «వృద్ధస్త్రీవివాహశాసనము'' శాసననిర్మాణసభలో «మూఁ'' చేయక మానరు. అప్పుడు మనము, లబలబ మొత్తుకొనుచు మన ప్రభుత్వమువారికి మొరలంపుకొనక తప్పదు. ఈమాటలకేమికాని మనము ప్రకృతమునకుఁ బోదము. మేము దివఱకుఁ జెప్పినట్లుగ మన యాచార్యులవారు «అష్టవర్షాభవేత్కన్యా» అనుపాదమునకుఁ బదియో డెండ్లపడుచని యర్థముసాధించి యాపైకే వివాహముచేయవలయునను సిద్ధాంతముచేసి యాసిద్ధాంతమును గొన్నియుక్తులతో స్థిరపఱుప మొదలిడిరి. ఆయుక్తులనుజూపించి వరుసగా విమర్శించెదము. మనస్మృతులలో వివాహమాడఁదగని నిషిద్ధలక్షణములుగల కన్యలనుగూర్చి తెలుపు ఘట్టములందు «అనన్యపూర్వికాం కాంతాం'' అని వాడియున్నారు- అనన్యపూర్వికయనఁగా దానముచేతఁగాని యుపభోగముచేతఁగాని పురుషాంతర పరిగృహీత కానిదియని యర్థము అట్టిదానిని వివాహమాడవలెనని చెప్పియున్నారు. దీనింబట్టి మనూవాక్యమువలన దానములలో నేదానముగావింపఁబడినదైనను లేక యితరులచే భోగింపఁబడినదైనను నా స్త్రీవివాహయోగ్య కాదని తాత్పర్యము తేలుచున్నది అనఁగాఁ బూర్వకాలమునుండి యిప్పటివఱకును మనలోఁ గొన్నిజాతులయందు బాల్యవివాహములును, మఱికొన్నిజాతులయందు బాల్యవివాహములును, మఱికొన్నిజాతులయందు బాల్యవివాహములును రజోదర్శనానంతరవివాహములును గావింపఁబడుచుండుటచే నన్యదత్తలగునట్టిగాని యన్యోపభుక్తలగునట్టికాని కన్యలు కొందఱు సంభవింపవచ్చుననియూహించియట్టివారినివివాహమాడరాదని వచించిరనిభావము ఇట్లుండఁగా మనయాచార్యులవారుపదియో డెండ్లవఱకుగానియుక్తవయస్సురాదనియునట్లువచ్చినవారిలో నొకతెమనస్సుఁబట్టలేక పురుషసాంగత్యముచేసినయెడ దానిని వివాహమాడవలదను వ్యవహారకములుగును గాని బాల్యములో పురుషసాంగత్యము సంభవింపదు, సంభవింపనియపుడు పురుషోపభుక్తయగుకన్నియను

బరిణయము గావించుకొనఁగూడదనువ్యవహారము సంభవింప నేరదు కానఁబూర్వకాలమున యుక్తవయస్సువచ్చిన మీఁదనె కన్యలకు వివాహము చేసెడివారనినిశ్చయింపవచ్చునని యుం సెలవిచ్చిరి. ఇంతకంటె విరుద్ధవాదము మఱియొకటి కలదా? లేదు. లేదు. ఈవిషయమై మాధవాచార్యులవారు వ్రాసినవాక్యము, మేమిచ్చిన యభిప్రాయమునె బలపఱచుచున్నది. చూడుఁడు పరాశరమాధవీయము 106 పుటను "అనన్యపూర్వికామితి దానేనోపభోగేనవా పురుషాంతరపరిగ్రహేతాం" అనిఁవ్రాయఁబడియున్నది. దీనింబట్టి యాచార్యులవా "రనన్యపూర్వికా" యనుపదముతోఁ బూర్వకాలమున రజస్వలా వివాహములున్నవని సాధింపఁజూచుట పరిహాసపాత్రము గానున్నదని బుద్ధిమంతులు గ్రహింపక పోరు.

ఇంతియఁగాదు దీనివలన మఱియొక బాధకూడ మనసోదరుల వాదమునకుఁ గలుగునటు తోఁచుచున్నది. అదేమన? వివాహమునకుముందు (అన్యపూర్వికా,(అన్యోపభుక్త) యయినకన్యను వివాహమాడకపోవుట పూర్వమందుఁగూడఁ గలదనియు నిప్పటికాలమునను మనసోదరులుగూడ నట్టికన్యలను వివాహమాడుట కిష్టపడరనియును స్పష్టపడినది. ఈయాచారము విదేశములందుఁగూడఁ గలదని వినుచున్నారముకదా. దీనింబట్టి రజస్వలయగువఱకుఁ గన్యలకు వివాహముఁ జేయనియెడల నందఱుగాకున్నను వారిలోఁ గొందఱయినను గామము నాపుకొనఁజాలక యన్యపురుషులతో సౌఖ్యమనుభవింతురనియు నది వెల్లడియైన యెడవారు యావజ్జీవము వివాహము లేక పురుషసౌఖ్యమును గోల్పోవుటయో, లేకున్న వ్యభిచారిణులగుటయో తటస్థింపక తప్పదనియు ధృవపడుచున్నది. ఈయాపద వారనుభవించుటకుఁ గారణ మేమని తలంచవలెను? ఆకన్యలకుఁ గామోత్పత్తియగుటకుఁ బూర్వము వివాహము చేసి యానాఁటికి వరులనుగూర్చియున్న వారీదుష్కార్యములకుఁ బాలుపడి యింతయాపదనుగొని తెచ్చుకొందురా? తెచ్చుకొనరు. అటులేని నీయాపదకుఁ గారకులు రజస్వలయగుటకుముందు వివాహము చేయని తలిదండ్రులనుటకు సందియముకలదా? లేదు. కాన అన్యపూర్వికను వివాహము జేసికొనఁగూడదను నీనిషేధవాక్యము బాల్యవివాహములను బలపఱచు సాధనముగాను రజోదర్శనానంతర వివాహములనర్థదాయకములని బోధించు నుపకరణముగాను నున్నదని యీవిమర్శవలన విశదమగుచున్నది. ఈవిమర్శనసార మేమన? రజస్వలయగువఱకుఁ గన్యలకు వివాహముఁ జేయనియెడ వారిలోఁ గొందఱుకాకున్నను గొందఱైనను బురుషసాంగత్యముఁ జేసి యది వెల్లడియైన వారలు చెడుట నిశ్చయముకావునను, ఆకన్యలలో నేకన్య యీదుష్కార్యమునకుఁ జేరఁబడునో తెలియదు కావునను, కన్యలందఱికిని బాల్యమునందె వివాహము చేయుట వలన వారికట్టియాపదలు ఘటింపవు కావునను, మానవజాతికంతకును బాల్యవివాహములే యుచితములని తేలినది.

నిషిద్ధకన్యలనుగూర్చి ముచ్చటించుచు "నశ్మశ్రువ్యంజనవతీం నచైవపురుషాకృతిం" అని విష్ణుపురాణము చెప్పి యున్నది. అనఁగా మీసములగుఱుతుగల దానిని బురుషాకృతిగల దానిని వివాహమాడరాదని దీనియర్థము. ఈ యర్థము నాధారముఁ జేసికొని మనయాచార్యుల వారు సాధారణముగాఁ బురుషులకుఁ బదియాఱేండ్లకుఁగాని మీసములు రానేరవు, స్త్రీలకు నట్లె పదియాఱేండ్లకు గాని మీసములు రావుగదా మీసములు వచ్చెడి యాప్రాయముకంటె ముందు మనము కన్యలకు వివాహముచేయుచుండినంగదా మీసములు వచ్చునదియు రానిదియు గ్రహించుటకు వీలుకలుగును? కాన మీసములు వచ్చినకన్యలను వివాహమాడఁగూడదను నిషేధముంబట్టి పూర్వకాలమున రజోదర్శనానంతరవివాహములె యున్నవని వ్రాయుటకు సాహసించిరి. ఇదేమివింత, స్త్రీలకుఁ బదియాఱేండ్లకెకాదు, నూఱేండ్లకు వివాహము చేసినను వారికి మీసములు రానే రావు. ఎక్కడనో యొకానొక కన్యకకుఁ బ్రకృతివిరుద్ధముగా మీసములువచ్చును. ఆ విరుద్ధముగావచ్చెడి మీసములు బొట్టుపెట్టినట్లు పురుషునకువలెఁ బదియాఱేండ్ల ప్రాయముననె రావలయునా? అంతకుముందు (8 ఏండ్లు మొదలు 12 సంవత్సరముల లోపల) రాఁగూడదా? పురుషులకందఱికిని బదియాఱేండ్లకే మీసములువచ్చుచున్నవా? కొందఱికిరువదేండ్లకును మఱికొందఱి కిరువదియైదేండ్లకును నింకఁగొందఱికి ముప్పదేండ్లకును మీసములువచ్చునను విషయము లోకానుభవముకలవారల కందఱకుఁ దెలియును. పురుషులకువలె స్త్రీలకు మీసములు వచ్చుటను జూచుటకై మన మెన్ని సంవత్సరములవఱకు నిరీక్షింపవలయును? ఆ నిరీక్షణమునకుఁ గాలనియమము తెలియదుకాన స్త్రీల మీసములఁబట్టి కూడ మనసోదరులు రజస్వలావివాహముల సాధింపఁజూచుట హాస్యాస్పదము గానున్నది. ఇదియిట్లుండనిండు.

అన్యభుక్తమగుకన్నెను మీసములువచ్చిన విలాసినిని వివాహమాడఁగూడదను నిషేధవచనముల నాధారముచేసికొని మనసోదరులు పూర్వకాలమున రజస్వలావివాహము లుండెడివనువిధినిఁ గల్పించుచున్నారు. ఇది తగునా? తగునేని మఱికొందఱు సోదరులు వెడలి పరాశరస్మృతియందు "మాతరంయదిగచ్ఛేత్తు భగినీం స్వసుతాం తథా. ఏతాస్తు మోహితోగత్వా త్రీణికృచ్ఛ్రాణి సంచరేత్" అని చెప్పఁబడియున్నది. అనఁగాఁ దనతల్లినిఁగాని తోఁబుట్టువునుగాని కూఁతునుగాని కూడినవాఁడు మూఁడుకృచ్ఛ్రములను జేసికొనవలయునని యున్నది. దీనింబట్టి పూర్వకాలమునఁ దల్లిని, తోఁబుట్టువును- గూఁతును గూడెడి యాచారముండినంగదా యీప్రాయశ్చిత్తము పుట్టునది, లేకు

న్న నీప్రాయశ్చిత్తవిధి యేలపుట్టినది? కాన మనమీ యాచారములను బూర్వాచారములనుగా నమ్మి యాచరింపవలెనని బోధించెదరు. వానినెల్ల మన మాచరింపవలసినదేనా? ఆచరింపఁదగదని వాదింపఁబోతిమా ఛీ నీతిలేని కుంఠలారా! ద్విపాదపశువులారా? మా బోధనువిని శుక్కిరిమిక్కిరిలాడక పరాశరవచనప్రకారము మాదరోచ్ఛద్బ్రాహ్మణులను జేటీచోద్బ్రాహ్మణులను గావలయును, కారేని మాగౌరవనీయులతో నీవిషయము చెప్పితిమా వారు వెంటనె "అకార్డింగ్ టుది హిందూ శాస్త్రాస్" అని "మాతృభగినీసుతాగమనవిధి" యను గ్రంథమును రచించి ప్రకటింపఁజేసి యావెంటనే "మాతృభగినీసుతాగమన శాసనము" నొకదానిని శాసననిర్మాణ సభలో "మా"చేసి మీరోగము నెట్లుత్రిప్పవలెనో యట్లుతిప్పెదరు. అది మొదలుకొని లబలబలాడుచు సభలు చేసికొని మొఱలంపుకొన మొదలిడెడిగతి మీకుఁబట్టును. అని బెదరింతురు. వీనికేమిగాని మఱియొక విషయముంగనుఁడు.

మనయాచార్యులవారు బాల్యవివాహములవలన బాలికల విద్యాభివృద్ధి కాటంకముకల్గుచున్నదనియు వారికి వివాహమంత్రములకర్థములు చేయఁదగినంత విద్యఁజెప్పించి యటుపై వివాహముఁజేయవలయుననియు నాపాటివిద్య పదియేండ్లకుగాని రాదనియుఁ గాన రజోదర్శనానంతరముననె వివాహములఁజేయుట యుచితమనియు వాదింపమొదలిడిరి. కాని బాలుర కెనిమిదవయేటనె యుపనయనము చేయవలయునని సెలవిచ్చియున్నారు. ఇదేమివింత. బాలుర కుపనయనమంత్రార్థములు తెలియఁదగినంత విద్యరాకున్నను వారికుపనయనము చేయవచ్చునఁట గాని వివాహమంత్రార్థములు తెలియఁదగినంత విద్య రానిది కన్యలకు వివాహము చేయఁగాదఁట! ఇదెక్కడఁ జెప్పఁబడియున్నది? పోనిండు. స్త్రీలకు మంత్రములువచ్చినంగదా మంత్రార్థములను జేయుటకు వారలగడంగవలయును. మంత్రములఁ జదువుటకు స్త్రీల కధికారముకలదా? "స్త్రీశూద్రౌ నాధీయాతాం" అను శ్రుతివాక్యము కలదుకదా. దీనింబట్టి స్త్రీలు వేదముచదువరాదని తేలుచున్నది. ఇట్లునిన "ఆంధ్రదినపత్రిక 28-1-1915 తేదిగలసంచికయందు శ్రీయుతౌర్యనారాయణమూర్తిగారు బాలురెనిమిదేండ్లు మొదలు 48 వత్సరములలోపల వసురుద్రాదిత్య వైశ్వానరబ్రహ్మచర్యములను సలిపి పిదప వివాహమాడినట్లు కన్యలును 17 సంవత్సరములు మొదలు 22 లోపల జనయః, గ్నా, వరూత్రీ, ధిషణా, అదితిః, అను బ్రహ్మచర్యములను జరిపి యనంతరమున "బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిం" అను సధర్మవాక్యానుసారముగా యౌవనవంతులైనపతులను వారె వరించి స్వయంవరవివాహములను

గావించుకొనవలెనని సిద్ధాంతముఁజేసియుండలేదా?" యని చెప్పవత్తురేమో! చెప్పనిండు, ఆర్యనారాయణమూర్తిగారు శ్రాద్ధములోఁ బితృస్వరూపులుగా వాడఁబడియున్న వసురుద్రాదిత్యులను బ్రహ్మచర్యములుగాఁ జెప్పియున్నారు. ఈవసురుద్రాదిత్య బ్రహ్మచర్యములు మేము చూచినంతవఱకు ధర్మశాస్త్రములం దెచ్చటను గనుపడియుండలేదు. బ్రహ్మచర్యాద్యాశ్రమముల నాలుగింటిలో నొక్కొక్కటి మరల నాలుగు భాగములుగా విభాగింపబడియున్నది. అందు బ్రహ్మచారి గాయత్రీబ్రహ్మచారి ప్రాజాపత్య బ్రహ్మచారి వైదిక బ్రహ్మచారి, నైష్ఠికబ్రహ్మచారి యని నాలుగు విధములుగావిభజింపఁబడియున్నాఁడు. సంశయము కలవారు గురుబాల ప్రబోధిక బ్రహ్మవర్గాదియందుఁ జూడఁగలరు. ఇట్లుండఁగా మన మూర్తిగారు వసురుద్రాదిత్యబ్రహ్మచర్యములను నేలోకమునుండి పట్టుకొని వచ్చిరో తెలియకున్నది.

ఇఁక స్త్రీలకు "జనయః, గ్నా, వరూత్రీ, ధిషణా, అదితిః" అనుబ్రహ్మచర్యపంచకము పాతకపంచకమువలెనే మనసోదరులు సృజించినట్లుతోఁచుచున్నది. ఇవి యే ధర్మశాస్త్రమందును గానరావు. స్త్రీలకు 17యేండ్లకుఁ బరిపూర్ణయౌవనము వచ్చుననుటకు సందియములేదు కదా, అది మొదలుకొని 22యేండ్లవఱకు బ్రహ్మచర్యపంచకము నడుపఁబోయినవారు పాతకపంచకమునార్జించుట కంటె వేఱేమివిద్యనార్జింతురు? పురుషుఁ డుపనయనానంతరముపరదేశముననో పరగ్రామముననో యున్న గురునికడ నివసించి బ్రహ్మచర్యములను యథావిధిగా నడుపును. బాలురకువలెనె బాలికలకును బ్రహ్మచర్యముకలదనిచెప్పుటచే బాలికలనుగూడఁ బరదేశగ్రామగృహములందున్న గురువరులదరికి విద్యార్జననిమిత్త మంపవలయునని తేలుచున్నది. యుక్తవయస్సువచ్చినకన్యలను బరదేశగ్రామగృహములకుఁబంపుట యుక్తముగాదు. ఈవిషయమును బాగుగ మనధర్మశాస్త్రములు శాసించుచున్నవి.

మనుస్మృతి, అధ్యాయము9, శ్లోకము 13 "పానం దుర్జనసంసర్గః పత్యాచవిరహోటనం. స్వప్నోన్యగేహవాసశ్చ నారీసందూషణాని షట్" అనిచెప్పినది. యముఁడు స్త్రీలకువిద్య నేర్పవలసినవారింగూర్చి యిట్లు చెప్పియున్నాఁడు. చూడుఁడుపరాశరమాధవీయము 112పుట "పితా పితృవ్యో భ్రాతా వా నైనామధ్యాపయేత్పరః" కన్యనుజదివింపవలసినవారు తండ్రి, పినతండ్రి, అన్న, వీరలేకాని యితరుఁడు చదివింపరాదు, అని దీనియర్థముకాన స్త్రీలకు బ్రహ్మచర్యవ్రతమిచ్చి యితరత్ర చదివించుట పరమునింద్యమని తెలియవచ్చుచున్నది.

అటులేని «బ్రహ్మచర్యేణ కన్యా యువానంవిందతేపతిం" అను సధర్వవచనమునకు వినియోగ మేమని యనియెదరా? దీనికి మనమూర్తిగారు 'బ్రహ్మచర్యానంతరము కన్య యౌవనవంతుఁడైనపురుషుని వివాహముచేసికొనవలయునని చెప్పియున్నారు. కాని యది తప్పు, ఈమంత్రమంబాయర్థములేదు. ఇఁకేమున్నదన; బ్రహ్మచర్యేణ బ్రహ్మచర్యముచేత కన్యా పడుచు యువానం యౌవనవంతుఁడైన పతిం భర్తను విందతే పొందుచున్నది. అనియర్థము. ఈయర్థము కన్య బ్రహ్మచర్యముచేత గర్భాధానముఁజేసికొనవలసినదని బోధించుచున్నది. కాని వివాహమునుబోధించుటలేదు. గర్భాధానమునకుముందు కన్య యొకమాసము బ్రహ్మచర్యమునడిపి పిదప వరునిగూడవలయునని సుశ్రుతశారీరస్థానము 20 పుటలో «తతో పరాహ్నే పుమాన్ మాసం బ్రహ్మచారీ సర్పిస్స్నిగ్ధః సర్పిఃక్షీరాభ్యాం శాల్యోదనంభుక్త్వా మాసం బ్రహ్మచారిణీం తైలస్నిగ్ధాంతైల మాషోత్తరాహారాం,నారీ ముపేయాద్రాత్రౌ"అని సూత్రముఖమున విశదీకరించియున్నది. కాన«బ్రహ్మచర్యేణకన్యా యువానంవిందతేపతిం" అను సధర్వవాక్యము, రజస్వలావివాహముం బోధించుట లేదనియు గర్భాధానమునకుముందుకన్య చేయవలసినవిధానమును దెలుపుచున్నదనియు మన సిద్ధాంతివలన గ్రహింపఁగలిగితిమి. ఇట్లు చెప్పినతోడనే స్త్రీలకు బ్రహ్మచర్యము నే యాశ్రుతులుబోధించున్నవని యొకవేళ మన నారాయణమూర్తిగారు పట్టుఁబట్టెదరేమో; పట్టుఁబట్టినను భయములేదు. బ్రహ్మచర్యమన నేమో మనము విమర్శించుకొందము. గురుబాలప్రబోధిక 187 పుట. «బ్రహ్మ వేదః తదధ్యయనార్థం వ్రతమపి బ్రహ్మ,తచ్చరతీతి బ్రహ్మచారీ» బ్రహ్మమనఁ గా వేదము. దానిని జదువుటకొఱకుఁబట్టినవ్రతమునకును బ్రహ్మమను పేరుగలదు. దానినాచరించువాఁడు బ్రహ్మచారియని తెలియవలెను. ఆబ్రహ్మచారియొక్క ధర్మము బ్రహ్మచర్యమనఁబడుచున్నది. దీనింబట్టి వేదమునుజదువుటకొఱకుఁ బట్టినవ్రతాచరణము బ్రహ్మచర్యమని తెలియవచ్చినది. స్త్రీలకు వేదములఁజదివెడియధికారములేనప్పుడు బ్రహ్మచర్యవ్రతము వారికెట్లుసిద్ధించును? అటేమి, స్త్రీలకు వేదములుచదివెడియధికారముకలదు, అదియున్నప్పుడు దానివెంటనే బ్రహ్మచర్యవ్రతమును నుండవచ్చునని పట్టుఁబట్టెదరా? అటులేని బాలురవలెనే బాలికలకును బ్రహ్మచర్యముకలదని యిదివఱకు మూర్తిగారు జెప్పియున్నారు! మన బాలురెపుడు బ్రహ్మచర్యము జరుపుచున్నారు? ఉపనయనానంతరమున జరుపుచున్నారు. అనుపనీతులగు బాలురు బ్రహ్మచర్యము జరుపఁదగునా? తగదు. అట్లేని కన్యలు నుపనయనానంతరమునందె బ్రహ్మచర్యమునుజరుపవలయునని తేలుచున్నది.

స్త్రీల కుపనయనము కలదని యార్యనారాయణమూర్తిగారు వ్రాసియున్నారా? వారి వ్యాసము కడిగి గాలించినను స్త్రీల కుపనయనము కలదనుమాట గానరాదు-అనుపనీతులగు బాలురకు వేదపఠనాధికారము లేనప్పుడనుపనీతలగు బాలికలకు వేదపఠనాధికారమెట్లు కలుగును? స్త్రీ లుపనయనముఁ జేసికొని బ్రహ్మచర్యవ్రతమును జరుపుట వరాహకల్పములోని ముచ్చటలు గాని యీ శ్వేతవరాహకల్పములోని ముచ్చటలు గావు. ఈవిషయమై యముఁడు "పురాకల్పే కుమారీణాం మౌంజీబంధనమిష్యతే, అధ్యాపనంచ వేదానాం సావిత్రీవచనంతథా" అని చెప్పియున్నాఁడు, దీనింబట్టి యీ శ్వేతవరాహకల్పములోఁ గన్యల కుపనయనము, వేదాధ్యయనము (బ్రహ్మచర్యము) లేవని ధృవపడినది. ఈవిషయమును శ్రీదయానందసరస్వతీస్వాములవారి సత్యార్థప్రకాశిక 48వ పుటలో నున్న "ద్విజులు తమయింట మగబిడ్డలకు యజ్ఞోపవీతమును గన్యలకు యథాయోగ్యమగు సంస్కారమును జేయించి యాచార్యకులమునకుఁ (పాఠశాలలకు) బంపివేయవలయు" నను వాక్యము బలపఱచుచున్నది. కాని మనసోదరులు తలఁచినట్లు గాఁ గన్యల కుపనయనము బ్రహ్మచర్యము (గురుకులవాసము) లోనగునవి లేవు కాని మఱియొక విధముగాఁ గన్యలకు నుపనయనగురుకులవాసములను మనధర్మశాస్త్రములు విధించుచున్నవి. అవియే బాల్యవివాహపతిసేవలని తెలియవలయును. ఈవిషయమై మనుస్మృతి, అధ్యాయము 2, శ్లోకము 67, "వైవాహికో విధిః స్త్రీణాం సంస్కారో వైదికస్స్మృతః, పతిసేవా గురౌవాసః గృహార్థోగ్నిపరిక్రియా" అనఁగా స్త్రీలకు వివాహము వైదికసంస్కారముగుచున్నది. పతిసేవయే గురుకులవాసము, గృహకృత్యమే యగ్నిపరిక్రియ, యని దీని యర్థము. ఈసంగతిని నితర మునులును బలపఱచియున్నారు. అదేమన? "స్త్రీణాముపనయస్థానే వివాహం మనురబ్రవీత్" అనఁగా స్త్రీల కుపనయనస్థానమునందు వివాహమును మనువు చెప్పియున్నాఁడు. ఇంతవఱకు మేము విన్నవించినదానిం బట్టి కన్యలు బాల్యమునఁ దండ్రి, పినతండ్రి, అన్నలకడ విద్య నేర్చుకొనవలయుననియు వివాహమైనపిదప భర్తకడ విద్యను గ్రహింపఁదగుననియుఁ దెలియవచ్చుచున్నది. మఱియు నీవిషయమును బలపఱచెడి మఱియొక సంగతిని విన్నవింపవలసియున్నది. ద్విజులలోఁ బ్రతి బాలునికిని నుపనయనకాలమందు జననీజనకు లిరువదియేను పోచలుగల (తత్త్వములను బోధించు) యజ్ఞోపవీతమును వేయుచున్నారుకదా. ఇట్లుండఁగా వివాహమునందు నత్తమామలు మరల మఱియొక యజ్ఞసూత్రమును నల్లుని మెడలో వేయుచున్నారు దీనికిఁ గారణమేమనఁ గొందఱు తత్త్వజ్ఞు లిట్లు చెప్పుచున్నారు. అదేమన? ఈయున్నులమిన్నకు నితఃపూర్వము విద్యా

వివేకాదులు కొంతవఱకు బోధించితిమి. ఇఁక మీఁదఁ దత్త్వబోధఁ జేయవలసిన భారము నీయందే యున్నదని యల్లునికిఁ జెప్పుటయే యత్తమామలు ద్వితీయయజ్ఞోపవీతము వేయుటవలనఁ దోఁచెడి భావమని చెప్పుచున్నారు. ఇపుడైనను మన యార్యనారాయణమూర్తిగారు తామొసంగిన "బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిం" అను నధర్వవాక్యము, రజస్వలావివాహములను బోధింపక బాల్యవివాహమును గావించుకొనిన కన్యలు తాము రజస్వల లైనపిదప యౌవనవంతులగు తమభర్తలను బొందుటకు ముందు సుశ్రుత శారీరస్థానము చెప్పినపగిది బ్రహ్మచర్యమును నొక మాసముఁ జరిపి భర్తలను బొందుటను బోధించినదని యొప్పుకొందురో! లేదో! ఆపైన వారి చిత్తము వచ్చినరీతిని వాదింతురుగాక,

ఈవిషయమై మే మింకొక్క సంగతినిఁ జెప్పవలసియున్నది. అదేమన? మన యార్యనారాయణమూర్తిగారు బాలురకువలెనె బాలికలకును బ్రహ్మచర్యము కలదని చెప్పుటచే బాలుర కుపనయనమువలెనె బాలికలకు వివాహ(ఉపనయన)ము శాస్త్రవిహితమని సాధింపఁబడినది. కాని యిఁక నీ వివాహము(ఉపనయనము) కన్యల కేవత్సరమునఁ జేయుట యుచితమో యిపుడు తెలుపవలసియున్నది. బాలుర కుపనయనము "గర్భాష్టమేషు బ్రాహ్మణ ముపనయీత, గర్భైకాదశేషు రాజన్యం, గర్భద్వాదశేషు వైశ్యం," అని యాపస్తంబసూత్రము చెప్పుచున్నది. ప్రతిస్మృతియును సూత్రమును నిట్లె చెప్పియున్నది. బాలురకువలెనె బాలికలకును నెనిమిది మొదలుకొని పండ్రెండేండ్లలోపల రజస్వలలు కాకముందు వివాహము చేయుట యుక్తమని స్మృతిసూత్రాదులన్నియుఁ దెలుపుచున్నవని యిదివఱకె యాయా ప్రకరణములయందు విపులముగా విన్నవించియున్నవారము. ఐనను సందర్భానుసారముగా రెండువచనములమాత్ర మిటనిచ్చి యీవిషయమును ముగించెదము. పరాశరుఁడు "అష్టవర్షా భవేద్గౌరీ, నవవర్షాతు రోహిణీ, దశవర్షా భవేత్కన్యా అతఊర్ధ్వం రజస్వలా" అని చెప్పియున్నాఁడు. దీనింబట్టి 8, 9, 10, సంవత్సరములలో వివాహము చేయుట యుత్తమమని తెలియవచ్చుచున్నది. ఈయుత్తమత్వమును బృహస్పతి చెప్పిన ఫలశ్రుతివచనము బలపఱచుచున్నది. "గౌరీందదన్నాకపృష్ఠం వైకుంఠం రోహిణీం దదత్ । కన్యాం దదద్బ్రహ్మలోకం రౌరవం తు రజస్వలాం" అనఁగా గౌరీదానమునఁ బరబ్రహ్మపదమును రోహిణీదానమువలన వైకుంఠమును గన్యాదానమువలన బ్రహ్మలోకమును గన్యాదాత పొందుచున్నాఁడనియు రజస్వలాదానమువలన నరకలోకమును ననుభవించుననియుఁ బైశ్లోకార్థము. దీనింబట్టి కన్యలకు వివాహ(ఉపనయ

నయము గర్భాష్టమ నవమ దశమ వత్సరము లందుఁ జేయుట యుత్తమోత్తమమని బోధపడినది. మే మింతదూరము శోధించినను మనసోదరులు తమపట్టువీడక తాముచేసిన శాస్త్రార్థమునను సరించి కన్యల కిరువదిరెండేండ్లవఱకు వివాహము చేయక బ్రహ్మచర్యమునడిపించుటకె ప్రయత్నింతురేని పరదేశములందువలెనె మనదేశమందుఁగూడ కొందఱుకానీనులుఁ బుట్టుదురో యెవరుచెప్పఁగలరు? ఈకానీనసంఖ్యను హేతువాదమునుగూర్చి వ్రాసినచోటఁ జదువఁగలరు. ఇఁకమనసోదరులు బాల్యవివాహములఁజేయుటవలన స్త్రీలకు నున్నతవిద్య లభింపనేరదని చెప్పనగుదురు. మనలోనున్నతవిద్యయన నేది? వేదత్రయమెకదా. అదిచదువుట కధికారములేదని యిదివఱకె విన్నవించుకొని యున్నవారము. ఎంతవిద్య చెప్పిన స్త్రీసంఘమునకు క్షేమముకలుగునో యంతవిద్య నేర్పవలసినదనియె మనశాస్త్రములు విధించుచున్నవి. చూడుఁడు ఆపస్తంబధర్మసూత్రము రెండవప్రశ్న 29ఖండావసానమును, "సానిష్ఠా యావిద్యా స్త్రీషు శూద్రేషు చ" దీనికిహరదత్తుఁడిట్లు వ్యాఖ్యఁజేసియున్నాఁడు "స్త్రీషు శూద్రేషు చ యావిద్యా సానిష్ఠా విద్యాసమాప్తిః తస్యామధిగతాయాం విద్యాకర్మపరితిష్ఠతీతి" అనఁగా స్త్రీశూద్రులం దేవిద్యకలదో యది నిష్ఠయనిపించుకొనుననియు, దానినభ్యసించుటచే విద్యాసమాప్తియగుననియు దీనియర్థము. ఆ స్త్రీశూద్రులందుఁగల యావిద్య యేదనియడిగెదరా? దానివెంటనున్న సూత్ర మిట్లుచెప్పుచున్నది "అథర్వణస్య వేదస్య శేషఇత్యుపదిశంతి" దీనికిహరదత్తుఁడు "అథర్వణాప్రోక్తమధీయతే ఆథర్వణికాః, తేషామామ్నాయః ఆథర్వణః, తస్యవేదస్య శేషోయం "యావిద్యా స్త్రీషు శూద్రేషుచ" ఇత్యుపదిశంతి ధర్మజ్ఞాఇతి" అనఁగా, అథర్వణునిచేఁ జెప్పఁబడినదానినిఁ జదివినవారి లాథర్వణికులనఁబడుదురు. వారివేద మాథర్వణవేదమనియు దానిశేషమే స్త్రీశూద్రులందు నిష్ఠయనుపేరుతోనున్న విద్యయనియు దానినిఁ బఠించుటతో విద్యాపరిసమాప్తి యగుననియు ధర్మజ్ఞులుపదేశించుచున్నారని యర్థము. ఇందువలన స్త్రీశూద్రు లాథర్వణ వేదశేషమును బఠింపఁదగుననియు దానియర్థమును గ్రహియింపసాధనముగు సాహిత్యము సంపాదించఁదగుననియుఁ దెలియవచ్చినదికదా, ఇట్లుండఁగా మనసోదరులుకొందఱు (ఆర్యసామాజికులు) పూర్వకాలమున స్త్రీశూద్రులకు నున్నతవిద్యలు (వేదశాస్త్రములన్నియు) నేర్పెడియాచారముకలదనియు నది మధ్యకాలమున నంతరించినదనియుఁ బురుషులు, అందుబ్రాహ్మణులు స్వార్థపరులై స్త్రీశూద్రులకు వేదములనుజెప్పక వారిని ణగఁద్రొక్కిరనియు దానివలన మనసంఘము హీనదశకు వచ్చినదనియు వారియిష్టము వచ్చినట్లు మనలో జాతిద్వేషములు ప్రబలుటకు నెన్నిమాటలు చెప్పవలయునో,

వ్రాయవలయునో శక్తివంచనలేక యన్నిటినిఁజెప్పుచు వ్రాయుచు నున్నవారు ఇంతకంటె సంఘోపకారకార్యము మఱియొకటిలేదని చెప్పవచ్చును. వీరియుప న్యాసములనువినిన వీరిగ్రంథములుపఠించిన శూద్రసోదరు లనేకులు వీరిమాటలను నమ్మి బ్రాహ్మణులు స్వార్థపరులై తమకు వేదము చెప్పలేదనితలంచి బ్రాహ్మణద్వే షమును బొందియున్నవారు ఆద్వేషమువలనఁగలుగవలసినఫలములుగూడ ననుభ వములోనికివచ్చుచున్నవి ఇంకనుముం దివి యభివృద్ధిఁజెందుననుటకు సంశయింప నవసరములేదు కాన నిప్పుడె మనసోదరులుచెప్పిన యీవిషయము సత్యమా? యసత్యమా? యని విమర్శించి యీవిషవృక్షమును బాగుగ ఫలితమునకు రాకముందె సమూలముగా విచ్ఛేదముచేయుట యుచితము లేకున్న దీనిఫలముల నెందఱనుభ వించి యీవిషమువలన నెందఱు బాధపడవలసివచ్చునో నిర్ణయించుటకు శక్య ముకాదు ఈవిషయమయి యార్యసమాజసంస్థాపకాచార్యులగు శ్రీ దయానంద సరస్వతీ స్వాములవారును దత్సామాజికులును వ్రాసినగ్రంథములందుఁ బూర్వకా లమున స్త్రీశూద్రులకు వేదపఠనాధికారముకలదని తెలుపుటకై "యజుర్వేదము 26వయనువాకము రెండవమంత్రము "యథేమాంవాచంకల్యాణీ మావదానిజనేభ్యః బ్రహ్మరాజన్యాభ్యాగుం శూద్రాయ చార్యాయచ స్వాయచారణాయ" అని పర మేశ్వరుఁడు సెలవిచ్చుచున్నాఁడు-ఏమనఁగా మనుష్యులందఱికొఱకుఁ గల్యాణమైన యీవాక్కును (ఋగ్వేదాది నాలుగువేదములయొక్క-వాణిని) నుపదేశించుచు న్నానో యట్లు మీరును జేయవలయును స్మృతులందు ద్విజులకుమాత్రమే వే దపఠనాధికారము తెలుపఁబడియున్నది ఇక్కడ "జన" శబ్దముచే ద్విజులనుమా త్రమె గ్రహియింపవలెనని కొందఱు ప్రశ్నింతురేని ప్రత్యుత్తరము పరమేశ్వరుఁడె యిచ్చియున్నాఁడు అదేమన బ్రాహ్మణక్షత్రియులకును వైశ్యశూద్రులకును స్త్రీలకును భృత్యులకును నతిశూద్రులకును, నేనీవేదములను బ్రకాశపఱిచినాను" అని పరమేశ్వరుఁడు ప్రతిజ్ఞచేసియుండగాఁ బూర్వాచారపరాయణులు స్వార్థప రాయణులై స్త్రీశూద్రులకు వేదములుచెప్పక యణఁగఁద్రొక్కినా"రని నిందించు చున్నారు మనసోదరులుచెప్పినట్లు బ్రాహ్మణులు స్వార్థపరాయణులై స్త్రీశూ ద్రులకు వేదాదివిద్యలనీయలేదనుసంగతి సత్యమా యసత్యమా యని విచారించు కొనుట మన కావశ్యకమయిన పనియైనది బ్రాహ్మణులు విద్యాలాభములఁ దెలి సికొని యాలాభములను స్వార్థపరతచేఁ దామె యనుభవింపవలయునని తలంచి యట్లొనర్చినది సత్యమే యగునేని వేదశాస్త్రములను క్షత్రియవైశ్యులకెట్లు

చెప్పిరి? వారికిఁజెప్పనప్పుడు వీరిస్వార్థపరతకు భంగము రాలేదా? ఇఁక స్వార్థపరతచేత స్త్రీశూద్రులకు వేదశాస్త్రములు చెప్పలేదనుట న్యాయమెట్లగును? ఒకవేళ క్షత్రియులు ప్రభుత్వముగలవారును వైశ్యులు కృషిగోరక్షణవాణిజ్యాదులవలన ధనవంతులునై యుండుటచే క్షత్రియులవలన సత్కారాదికమును వైశ్యులవలన ధనవస్త్రాదికమును నాశించుకొని ప్రత్యుపకారముగా వారికి వేదశాస్త్రములఁ జెప్పిరనియు స్త్రీశూద్రుల వలన నట్టిలాభములు లేమిఁజేసి వీరికిఁ జెప్పలేదనియుఁ జెప్పెదరా? స్త్రీలవలన సర్వ సౌఖ్యముల ననుభవించుచున్నారు. "శూద్రస్యద్విజశుశ్రూషా" యను శాస్త్రముననుస రించి శూద్రులవలననుశుశ్రూషాలాభమును దాము పొందుచున్నారు. అపుడు ప్రత్యుప కారబుద్ధితో క్షత్రియవైశ్యులకు వేదశాస్త్రములఁ జెప్పియున్నయెడల నట్లే స్త్రీశూ ద్రులకును వేదశాస్త్రములఁ జెప్పవలసినయవసరము బ్రాహ్మణులకుఁ గలిగియేయున్నది. అట్లేల చెప్పలేదు? దీనివలన బ్రాహ్మణులు స్వార్థపరులై స్త్రీశూద్రులకు వేదశాస్త్ర ములఁ జెప్పలేదను వాదము నిరాకరింపఁబడుచున్నది. క్షత్రియవైశ్యులకు వేదశాస్త్ర ములను జెప్పి స్త్రీశూద్రులకు నవి చెప్పకపోవుటకుఁ గారణము భారతము చెప్పినట్లు "స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా" అనఁగా స్త్రీలకు శూద్రులకు ద్విజబంధువులకు వేదత్రయము శ్రుతిగోచరము కాఁగూడదనెడివిధి ననుసరించి చెప్ప లేదని చెప్పుట సర్వసమంజసమైయున్నది. ఒకవేళ శూద్రులయందలి జాతిద్వేషముచే నున్నతవిద్యఁ జెప్పలేదందురా? అటులైన శూద్రజాతియందువలెనే స్త్రీజాతియందును వారికి జాతిద్వేషము కలదని చెప్పవలయును. బ్రాహ్మణేతర జాతులయందుమాత్రమే స్త్రీజాతియుండి బ్రాహ్మణజాతియందదిలేనప్పుడుకదా వారికి స్త్రీజాతియందు ద్వేషముండుటకు నవకాశముకలుగునది? లేనప్పు డదియెట్లు చెల్లును? ఒకవేళ శ్రుతిస్మృ తిపురాణేతిహాసములనురచించిన బ్రాహ్మణులకు స్త్రీజాతియందు ద్వేషముకలదం దురా? వారికి మాత్రము తల్లి తోఁబుట్టువు భార్య బిడ్డ, లోనగువారు లేరా? లేని యెడ వారెట్లుజన్మించిరి? ఉండిరా? ఉండినఁదమతల్లి తోఁబుట్టు భార్య బిడ్డలకు స్త్రీజాతియందలిద్వేషముచే విద్య చెప్పలేదని చెప్పెడివీరిబోధను జనమువిశ్వసించుటకంటె వివేకశూన్యమును స్వభావవిరుద్ధకార్యమును వేఱుగనుండదని ఘంటాపథముగ చాటిం పవచ్చును. ఇదియిట్లుండనిండు. మనసోదరులు చెప్పిన "యథేమాంవాచం" అ ను మంత్రమునందు స్త్రీలకు వేదము చెప్పవలయునను నర్థముగలపద మెక్కడనున్నది? స్త్రీలనుగురించి చెప్పకపోయినను శూద్రులకు వేదము చెప్పుమని కలదుకదాయందురా

వేదములను శూద్రులకు జెప్పుటను మాట యెందెచటనున్నది? అదేమి « యథేమాం వాచంకల్యాణీ మావదానిజనేభ్యః ,, అని చెప్పఁబడియుండలేదా? యనియనిగదరా? జనులకెల్లను శుభప్రదమైన యీ వాక్యమును జెప్పుచున్నాననికలదు కాని యందు వేదములను సర్వజనులకెల్లనుఁ జెప్పుచున్నాననువచన మెచటఁగలదు? లేకున్నను నట్టిష్ఠము చేయవలయుననియుందురా? అట్లుచేసినయెడల శూద్రులకు వేదములను దప్పక చెప్పితీరవలసినదని తెలుసుగదా? తెలుసు. అప్పుడు వారి కుపనయనము చేయవలసిన బాధ్యత కలుగుచున్నది. శూద్రుల కుపనయనముఁ జేయవచ్చునని మన యార్యసామాజికసోదరు లేగ్రంథమునందైన వ్రాసియున్నారా? అది దివిటీలు వేసి వెదకినను వారిగ్రంథములందుఁ గానరాదు. ఇఁక శూద్రులకు వేదము చెప్పుటెట్లు? అనుపనీతులగు ద్విజబాలురకు వేదపఠనాధికారము లేదని శాస్త్రములందుఁ జెప్పఁబడియున్నది. ఆచారము నట్లేయున్నది. ఇట్లుండఁగా నుపనయనసంస్కారమె చెప్పఁబడని శూద్రసోదరులకు వేదపఠనాధికార మెట్లుసంభవించును? ఒకవేళ శూద్రసంఘమేమి కోరి యిప్పుడు వారి కుపనయనము గావించి వేదములఁ జెప్పుట కారంభింతమందురా? అటులేని శూద్రుల కుపనయనముఁ జేయఁగూడదనియు వేదములనువిడిచి యితరశాస్త్రములు చెప్పవచ్చుననియు నీకలహకారకులైన యార్యసమాజసంస్థాపకాచార్యులగు దయానందసరస్వతీస్వాములవారె తమ సత్యార్థప్రకాశనామక గ్రంథరాజమునందె 52 పుటలో వారిహస్తములతోడనే వ్రాయించియున్నారు. ఆ కనకాక్షరవిన్యాస మిటఁ బ్రదర్శించుచున్నారము « బ్రాహ్మణ స్త్రయాణాం వర్ణానా ముపనయనం కర్తుమర్హతి రాజన్యోద్వయస్య వైశ్యో వైశ్యస్యైవేతి, శూద్రమపి కులగుణసంపన్నం మంత్రవర్జమనుపనీత మధ్యాపయేదిత్యేకే » ఇది సుశ్రుతము యొక్క సూత్రస్థానమందలి రెండవఅధ్యాయపువచనము. బ్రాహ్మణుఁడు మూఁడువర్ణములను అనఁగా బ్రాహ్మణక్షత్రియవైశ్యులను క్షత్రియుఁడు క్షత్రియవైశ్యులను వైశ్యుఁడు వైశ్యవర్ణమునను, యజ్ఞోపవీత మొసఁగి చదివింపనగును. శూద్రుఁడు కులీనుఁడును శుభలక్షణయుక్తుఁడు నయ్యెనేని యతనికి మంత్రసంహితనువదలి తక్కిన సమస్తశాస్త్రములు చదివింపవచ్చును. శూద్రుఁడు చదువను వచ్చును. కాని యతనికి నుపనయనముఁ జేయఁగూడదు. అని యనేకాచార్యుల మతము » అని తెగవేసి వ్రాసిరి. దీనింబట్టి శూద్రుల కుపనయనముచేయరాదనియు వేదములు చదివింపరాదనియుఁ బరార్థపరులైన యార్యసామాజికులె స్థిరపఱిచియున్నారు. ఇట్లుండఁగా బ్రాహ్మణులు స్వార్థపరులై శూద్రులకు వేదములఁ జెప్పలేదనుట

కదుంగదా నింద్యము గాదా? ఇట్లు స్వవచనవ్యాఘాతములతో గ్రంథములు వ్రాయుటవలన ధర్మములు చెడుటయె కాక కలహములు వృద్ధియై సంఘము క్షీణించదా? సంఘైక్యమాచరించెడివీరలు సంఘసంస్కారులెట్లు కాఁగలరు?

ఇప్పటికాలపు మనసోదరులకుఁ బూర్వకాలపుమహర్షులవాక్యములందుఁ గాని మధ్యకాలపుఁ బండితులవాక్యములందుఁ గాని యాధునికపండితవాక్యములందు గాని యుండు గౌరవముకంటె వేయిమడుంగు లాంగ్లేయపండితవాక్యములందు గౌరవము కలదు. కాన వారివాక్యముల నీసందర్భమునఁ గొన్నిటిఁ జూపుచున్నారము. ఆంధ్రవారపత్రిక 27-8-18 తేదిగలసంచికయందు డాక్టర్ యమ్. యస్. పెంబ్రీ యమ్; ఏ గారిట్లు వ్రాసియున్నారు. "స్త్రీల కున్నతవిద్య చెప్పవలయునని యేమేమో చెప్పెదరు-ఉన్నతవిద్య స్త్రీకిఁ గాని పురుషునకుఁ గాని రాజ్యమునకుఁ గాని మంచిదికాదు. మూడునాలుగుసంవత్సరము లెంతయో పనిచేసి యున్నతవిద్యనభ్యసించుటవలన శరీరదార్ఢ్యము నశించును. ధనము వ్యయమగును. బుద్ధి యెంతయో వినియోగింపవలసియుండును. ఈగుణముల నన్నిటిని వివాహమునకై వినియోగించిన నెంతయో లాభము చేకూఱును. సగము కాలముగడచినవిద్యావతి యితరులకంటె భార్యగఁ గాని తల్లిగఁ గాని యాధిక్యత కలిగియుండుననుటకు నిదర్శనము లెవ్వియును లేవు. సంగతిసందర్భములన్నియు దీనికి భిన్నముగ నేయున్నవి......ఒక్క సంగతినిమాత్ర మంగీకరించుచున్నారు. జను లెంత విద్యాధికులుగానుందురో యంతతక్కువసంతానము నుత్పత్తిఁ జేయుదురు." అనిస్పష్టముగా స్త్రీలకేకాక పురుషులకుఁగూడ నున్నతవిద్య కూడదని పరదేశపు వైద్యశాస్త్రజ్ఞులు, తమదేశములో స్త్రీల కున్నతవిద్యనిచ్చి యందువలన నష్టములఁబొంది యానష్టములను సూచించుచు వ్రాసియున్నారు. త్రికాలజ్ఞులగు మనపూర్వులీవిషయమును వేల సంవత్సరములక్రిందటనే కనిపెట్టి స్త్రీల కున్నతవిద్య పనికిరాదని వ్రాసియున్నారు. ఇట్లుండఁగా మనసోదరులు బాల్యవివాహములవలన స్త్రీల కున్నతవిద్యాభంగమగుచున్నదని వాదించుట హాస్యాస్పదముగానున్నది.

అందఱిమేలుకొఱకు వెడలిన వేదముల నందఱును జదువరాదనియుఁ గొందఱు మాత్రమె చదువవచ్చుననియుఁ జెప్పుట యుచితమాయని యడిగెదరా? తాము తలంచినట్లు వేదములు సర్వులకును శుభావహకార్యములను బోధించుటకు వెడలిన మాట సత్యమె. కాని యంతమాత్రముచే వాని నందఱును బఠింపవచ్చునని చెప్పుట మాత్రము సరిగాలేదు. అదేమందురా? రాజ్య మందఱిమేలుకొఱకు స్థాపింపఁబడిన

దని యందఱు అంగీకరించుచున్నారు. ఆ రాజ్యమువలనఁగలుగు మేలు నందఱును బొందుచున్నారు. కాని యందఱు రాజ్యము నేలుచున్నారా? లేదు. పోనిండు. రాజ్యమేలుట కవకాశముండునా? ఉండదు. అందులకుఁ బ్రయత్నమునైనఁ జేయవచ్చునా? చేయఁగూడదు. ఎవరేలవలయును? ఎవరు ప్రభువులుగానుందురో వారే యేలవలయును. రాజ్య మందఱి మేలుకొఱకు స్థాపింపఁబడినదైనను దానివలనఁగలుగు మేలు నందఱుఁబొందుచున్నను దాని నందఱు పరిపాలించుట కధికారులు కాక ప్రభువు లెట్లధికారులైరో యట్లే వేదము లందఱికి మేలును బోధించెడికొఱకు వెడలినవైనను వానివలనఁగలుగు ఫలముల నందఱనుభవింపఁదగుదురుకాని వాని నందఱు చదువుట కర్హులుకానేరరు. కాన మనయార్యసామాజికసోదరులు స్త్రీశూద్రాధ్యయనవిధియని పెద్దపెద్దగ్రంథములు వ్రాయుట నిరర్థకమగుచున్నది.

దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు, బి. ఏ.

సంఘసంస్కర్తల యంతశ్శక్తి.

నేఁటికాలమునకుఁ బూర్ణముగా బైటఁబడినది. వీరు తమప్రతివాదులనుసాధించుటకుగాను దూషణపాండిత్యమును జాల సంపాదించియున్నవారు. అది దినదినప్రవర్ధమానమగుచున్నది. వేదముల నెఱుఁగరు. స్మృతు లర్థముకావు. సూత్రములు చూచియుండలేదు. పురాణములు దుకాణములలోఁ గనుచుందురు. ఇతిహాసములు వారికిఁ బరిహాసములేకదా! వారు చదివినది పరభాష. చేయఁబూనినది స్వధర్మసంస్కరణము. వీరి కోపకయానున్న. పనువా మెంతు. ఇటువంటిసంస్కర్తలలో నగ్రేసరులని చెప్పఁదగిన శ్రీయుత దుగ్గిరాల సూర్యప్రకాశరావు. బి, ఏ. గారు రవిపత్రిక సం 15 సంచిక 35లో "రజస్వలావివాహశాసన"మను శీర్షికక్రింద వ్రాసిన వ్యాసమునందుఁబూర్వాచారపరాయణపండితులగు తమ సాటిసోదరులఁగూర్చి "తమనైసర్గికరాక్షసస్వభావమును బ్రత్యక్షము గావించుచున్న బ్రాహ్మణరాక్షసులుకొందఱు పత్రికాముఖమున మనకు సాక్షాత్కారులగుచున్నవారు" అని దూషించియున్నవారు వీరు బ్రాహ్మణులు కారా? రాక్షసులుకాక నిరక్షరకుక్షులైయుండిరా? రాక్షసబ్రాహ్మణులు స్వయంవరవివాహములను జేసికొనఁబోవు స్త్రీలను దూషించుటచే వారినిఁ బ్రతిదూషణము గావించితిమందురా? వారు స్త్రీలనుదూషించిన మనరావుగారు పురుషులను దూషించిరికదా! ఇఁక వీరియాధిక్యమేమి? రాక్షసబ్రాహ్మణులు స్త్రీలనుగూర్చిచేసినయాక్షేపణ మేమి? "ఆశాసనము దొరతనమువారి కంగీకరమయ్యెనేని బ్రా

హ్మణకన్యలు చండాలాదిసంపర్కమున్నపేక్షించి ఫలహీనింగావింతురు,, నిదియేకదా ఇం దసత్యమేమున్నది? రజస్వలయై స్వయముగా నిష్టమువచ్చినవానినివరింపంబోవు కన్య తనచిత్తమునకువచ్చిన చండాలునివదలి యిష్టములేని బ్రాహ్మణుని వరించునా? అట్లువరించవలయునా? అటులేని నది స్వయంవరవివాహ మెట్లగును; అప్పుడు వర్ణభేదము కన్యాస్వయంవరమునకుం బ్రతిబంధకమగుచుండలేదా? దానినేలపాటింపవలెను? వర్ణభేదములు సంఘోపకారకములగునా! అగునని మనరావుగారు తలంచుచున్నారా? తలంతురేని «హిందూదేశమునుబాధించుచున్నవి రెండు ముఖ్యవిషయములుకలవు. (1) వర్ణభేదము (2) అతిబాల్యవివాహములు» అని వ్రాయుదురా? వర్ణభేదములు సంఘబాధకములనివ్రాసిన రావుగారు «బ్రాహ్మణస్త్రీలు చండాలాదిసంపర్కముచేతురనిన నాగ్రహపడి దూషించుట నిషిద్ధముకాదా,

అతిబాల్యవివాహములు మనహిందూదేశమును బాధించుచున్నవని మనరావుగారు వ్రాసియున్నారు. ఈవిషయము వీరు తెలిసివ్రాసినారా? లేదు, ఇతరులువ్రాయంగాం జదివి యామాటవ్రాసినారు. అదెట్లనెదరా? «ఈరెండును (వర్ణభేదము, అతిబాల్యవివాహము) దేవునికృపవలన స్థిరముగనుండునంతకాలము బ్రిటీషుదొరతనమువారు హిందూదేశసామ్రాజ్యమును నిర్భయముగా నలువదివేల సోల్జరుపటాలములతో నేలుచు ముప్పదికోట్లజనులభరతఖండమున నున్నవారనుమాట పాటింపనక్కఱలేదని కొందఱు పాశ్చాత్యపండితులు వ్రాసియున్నారు» అని ఖ.సరావుగారువ్రాసినదానింబట్టి తెలియవచ్చినది. నల్లదొరలగు మనసూర్యప్రకాశరావుగారికివలెనె తెల్లదొరలగు నీపాశ్చాత్యపండితులకుంగూడ లోకానుభవము లేనట్లుదోంచుచున్నది. ఆదేశమున హిందూదేశమున హిందువు లొక్కరే నివసించుచుండుటలేదు. మహమ్మదీయులు పారసీకులు క్రైస్తవులు లోనగువారు వసించుచున్నవారు. వారు హిందువులవలె వర్ణభేదములు బాల్యవివాహములు కలవారుకారు. ఇంగ్లాండునందెంత మందిగ్లీషువారిజనసంఖ్య యెంతగలదో హిందూదేశములోని మహమ్మదీయజనసంఖ్య యంతగలదు. పైనం బారసీలయు క్రైస్తవులయు జనసంఖ్య మిగిలియున్నది. హిందువులు వర్ణభేదముంబాటించినను వారిలో నధికసంఖ్యాకులగు క్షత్రియశూద్రాదిసంఘములవారు రజస్వలావివాహములంగావించుకొనువారని మనసంస్కారవాదులె చెప్పుచున్నవారు. కాంబట్టి వీరందఱు రజస్వలావివాహములను జేసికొనుటవలన బలవంతులైయున్నారనుటకు సందియములేదుకదా ఇంక వారివాదమునుబట్టి బాల్యవివాహములంగావించుకొనువారు బ్రాహ్మణులు

వైశ్యులు స్వర్ణకారులు లోనగువారెకదా. వీరందఱును జేరి యించుమించుగా ౯కోట్లు జనులుండవచ్చును. హిందూదేశమునంగల ముప్పదికోట్లజనులలో నైదుకోట్లజనులుమాత్రమె బాల్యవివాహములం గావించుకొని బలహీనులైయున్నారని తెలియవచ్చుచున్నది. ఇట్లుండఁగా (హిందూదేశమున ౨౫కోట్లజనులు రజస్వలావివాహములవలన బలవంతులైయుండఁగాను, ఇందు ౪కోట్లప్రజలు వర్ణభేదములులేక శక్తిసంపన్నులైయుండఁగాను) నీవిషయమునుగ్రహింపని పాశ్చాత్యపండితులు "బ్రిటీషుదొరతనమువారునిర్భయముగా నలువదివేలసోల్జరుపటాలములతో నేలుచు ముప్పదికోట్లజను లీభరతఖండమున నున్నారనుమాట పాటింపనక్కఱలేదు" అనివ్రాయుట లోకానుభవజ్ఞానవిహీనతచేత నేయనియును నిరాటంకముగాఁ జెప్పవచ్చును. వారిమాటలనునమ్మినమన రావుగారికి నదియేగతి.

మనరావుగారు "వేదశాస్త్రపురాణములు మనమతముల కాధారములైనచో వానిచెప్పిన నడుచుట మనకుఁ గర్తవ్యమైనచో వానిలో నెచటనైన బాల్యవివాహములకు దృష్టాంతములుకలవా? బ్రహ్మవిష్ణుమహేశ్వరులభార్యలును సప్తర్షులభార్యలును వేదఋషులపత్నులును రామాయణభారతభాగవతాదిగ్రంథములయం దుదాహరింపఁబడిన ప్రసిద్ధపురుషజాయలును గన్యలుకారు; రోహిణులుకారు; గౌరులుకారు; వారందఱు రజస్వలలే, అనివ్రాయుచున్నారు. ఈవాదముంగూర్చి యిదివఱకు దేవయాన్యాదిపరిణయములంగూర్చి ముచ్చటించినచోట విపులముగాఁ జర్చించియుంటిమి. ఐనను ముఖ్యములగుసమాధానముల నిటవ్రాయుచున్నారము. బ్రహ్మవిష్ణ్వాదిదేవతలయుఁ గశ్యపాదిమహర్షులయు స్మృతులు మనకుఁ బ్రమాణములగును గాని వారిశీలము (అనుష్ఠానము) నిబద్ధముకానియెడల నదిమనకుఁ బ్రమాణముకానేరదు. ఎనకువలెనె వారికిని వేదమె ప్రమాణమైయున్నది. ఈవిషయము "వేదో ధర్మమూలం" అనుగౌతమసూత్రముచే దృఢపఱుపఁబడుచున్నది. "తద్విదాంచ స్మృతిశీలె" ఇందులకుభాష్యము "తద్విదాం వేదవిదాం మన్వాదీనాం యా స్మృతిః తత్ప్రణీతధర్మశాస్త్రం యచ్చశీల మనుష్ఠానం గ్రంథే నిబద్ధం తే స్మృతిశీలే అస్మదాదీనాంప్రమాణాం, నచ తేషా మనుష్ఠానం" అనఁగా వేదవిదులైన మన్వాదులచేఁజెప్పఁబడిన ధర్మశాస్త్రములును వేదనిహితములైనవారి యనుష్ఠానములును మనకుఁ బ్రమాణములు. కాని వారి కేవలానుష్ఠానము మన కాచరణీయముకాదు. అదేలయనఁగా "యది శీలమపి పమాణం తర్హి భవ త్యతి ప్రసంగః, కథం కతరభరద్వాజౌ వ్యత్యస్యభార్యే జగ్మతుః,

వసిష్ఠశ్చాండాలీ మక్షమాలాం, ప్రజాపతి స్స్వదుహితరం, జామదగ్న్యేన రామేణాపి పితృవచనా దవిచారేణ మాతుశ్శిర శ్ఛిన్నం. ఇత్యాదిపాపం శీలమపి ప్రమాణం స్యాన్నేత్యాహ" శీలముగూడఁ బ్రమాణము గానేని యతిప్రసంగము సంభవించును. ఎట్లనఁగా, కతరభరద్వాజులు వ్యత్యస్తభార్యలను బొందిరి. (ఇది వ్యభిచారము) వసిష్ఠుఁడక్షమాలయను చండాలకన్యను బరిణయమయ్యెను (ఇది జాతిసాంకర్యము) బ్రహ్మదేవుఁడు తనకూఁతురగు సరస్వతిని వివాహమాడెను. (అగమ్యాగమనము) పరశురాముఁడు పితృవచనానుసారముగాఁ దల్లితల నఱికెను (ఇది మాతృహత్య) ఇవి వేదవిరుద్ధములై పరమనింద్యములై యుండియు మన పూర్వపురుషులచే నాచరింపఁబడియున్నవి. వారియనుష్ఠానములు మన కనుష్ఠేయములని నచో నివియన్నియు మన మాచరింపఁదగునా? తగవు. ఏల? "తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయోనవిద్యతే. తదన్వీక్ష్య ప్రయుంజానః సంసీద త్యల్పకోనరఇతి," దేవతలు ఋషులు మున్నగువారు వెనుకఁ దెలిపినవిధమున ధర్మవ్యతిక్రమముగా నడచినను వారిప్రభావవిశేషముచేతఁ బ్రత్యవాయముండనేరదు. అల్పుఁడగువాఁడు వారినడతను జూచి యట్లునడచినయెడల నశించుచున్నాఁడు" అని గౌతమధర్మసూత్రవృత్తియందు హరదత్తాచార్యులవారు తెలిపియున్నారు. దీనింబట్టి మనరావుగారు బ్రహ్మాదిదేవతలు సప్తఋషులు మహర్షులు రజస్వలావివాహముచేసికొనినట్లు మనము రజస్వలావివాహములఁజేసికొనుట యుచితమని వ్రాయుట యనుచితము. ఈయపార్థము మనరావుగారులోనగువారు స్వమతగ్రంథములను జూడకపోవుటవలనఁ గలిగినదని తెలిసికొందురు గాక.

చిలకమర్తి, లక్ష్మీనరసింహముగారు.

---

ఈనడుమ శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారు తమ "దేశమాత," పత్రికలో "రజస్వలావివాహములచట్టము," అనుశీర్షికక్రింద నొకవ్యాసము వ్రాసియున్నారు. అందు మనపంతులవారు హిందువులనినచో బ్రాహ్మణవైశ్యేతర జాతులు నగుననియు వారిలో రజస్వలావివాహము లాక్షేపణీయములు కావనియు వ్రాసియున్నారు. వారుచెప్పినట్లు బ్రాహ్మణవైశ్యేతరజాతులవారు హిందువులైన మాట సత్యము. వారికి రజోదర్శనానంతరవివాహము లాక్షేపణీయములుకావనుటయు యుక్తముకాని "జాతివ్యవస్థగా వివాహములు మనపూర్వులు ధర్మశాస్త్రములందు వ్రాసియుండలేదు." అని వ్రాయుచున్నారు. ఈవ్రాఁత మనసోదరులు ధర్మశాస్త్రముల ముక్కనుమాత్రమైనఁ జూడకపోవుటవలనవచ్చిన సర్వానర్థవిధాత యనఁదగియున్నది. రజస్వలావివాహములు బ్రాహ్మణులకు నిషిద్ధములైనట్లు పరాశరుఁడుచెప్పిన "యస్తాం సముద్వహేత్కన్యాం బ్రాహ్మణో మదమోహితః, అసం

భాష్యో హ్యపాంక్తేయః సవిప్రో వృషలీపతిః,, అనువచనమును జూపించి యిదివఱ
కె విన్నవించియున్నారము. బ్రాహ్మణాదులు వైశ్యులలోనగువారు మ
నుస్మృతి, అధ్యా3 శ్లో26, ,,గాంధర్వో రాక్షసశ్చైవ ధర్మ్యౌ క్షత్రస్యతౌస్మృతౌ,, రజస్వలమైన తరువాతఁ గావలసిన గాంధర్వ రాక్షసవివాహములు క్ష
త్రియులకు ధర్మ్యములని తెల్పియున్నారు. కాన మనపండితుల
వారు జాతివ్యవస్థగా వివాహములు మనపూర్వులు ధర్మశాస్త్రములయందు వ్రాసి
యుండలేదని వ్రాయుటకు ధర్మశాస్త్రములఁ జూడకపోవుటయె కారణమని ధ్వనించు
చున్నది. ఈవివాహశాసన మైచ్ఛికమని వ్రాసియున్నారు. కాని యది యనుచితమని
మొదటనె వ్రాసియున్నారము. కానఁ బ్రత్యుత్తరము మరల వ్రాయమానితిమి. ఈర
జస్వలావివాహములను 100కి 90మంది అంగీకరించుచున్నారని వ్రాసియున్నారు. ఇది
యబద్ధమని యీనడుమఁ బత్రికలలోఁ బ్రకటింపఁబడిన రజస్వలావివాహనిషేధసభల
తీర్మానములు వేనోళ్ళఁ జాటుచుండుటచే మేము వేఱుగ నిరసింపమానితిమి.

,,విజ్ఞానేశ్వరుఁడు రజస్వలావివాహములను నిషేధింపలేదు కానమనము సమ్మతిం
చి యథేచ్ఛముగా నాచరించవచ్చును,, అని వ్రాయుచున్నారు. ఇందు రెండువి
షయప్రసంగములున్నవి. అవి (1) విజ్ఞానేశ్వరుఁడు రజస్వలావివాహముల ని
షేధింపలేదనుట (2) నిషేధింపని కార్యము చేయవచ్చుననుట. వీనిలో మొదటిది త
ప్పని విజ్ఞానేశ్వరుఁడు మితాక్షరధర్మశాస్త్రమునందు 9పుట ,,పితా పితామహో
భ్రాతా సకుల్యో జననీతథా. కన్యాప్రదః పూర్వనాశే ప్రకృతిస్థః పరఃపరః
అప్రయచ్ఛన్ సమాప్నోతి భ్రూణహత్యా మృతావృతౌ,, తండ్రి,తాత,అన్న,జ్ఞా
తి,తల్లి, వీరలు క్రమముగాఁ గన్యాదాతలు, ఈదాతలు కన్యరజస్వలయగుటకుముందు
దానముచేయనివారై ప్రతిఋతువునందును భ్రూణహత్యనుబొందుచున్నారు. అని
రజస్వలావివాహముల నిషేధించియుండఁగా విజ్ఞానేశ్వరుఁడు మితాక్షర ధర్మశా
స్త్రమునందు రజస్వలావివాహముల నిషేధింపలేదని చెప్పుట విరుద్ధప్రసంగము కాదా?

(2) నిషేధింపని కార్యము చేయవచ్చుననుట నిరాకరము. మితాక్షరమునందు
దక్షిణహస్తముతో గుదప్రక్షాళనము చేసికొనఁ గూడదని నిషేధింపలేదు. విజ్ఞానేశ్వరుఁ
డు నిషేధింపని కార్యము సమ్మతించి యథేచ్ఛముగా నాచరించవచ్చునేని దక్షిణ
హస్తముతో గుదప్రక్షాళనముఁ జేసికొనవచ్చునా? దీనిని మనపండితులవా రంగీకరింతురా?
ఇట్లె విజ్ఞానేశ్వరుఁడు మితాక్షరనందు వామహస్తముతో భుజింపఁగూడదని

వ్రాసియుండలేదు. నిషేధింపని కార్యమాచరణీయమగు నేని వామహస్తముతో భుజించుట కారంభింపవలసినదే నా ? దీనిని మనపంతులవా రంగీకరింతురా ? ఈమాటలకేమి కాని ధర్మశాస్త్రములు నిషేధింపకపోయినంతమాత్రమున నింద్యకార్యము లనింద్య కార్యములు కానేరవు.

మనపంతులవారు దక్షిణదేశమున బ్రాహ్మణులలో నంబూరివారను నొకతెగ వారు రజస్వలావివాహములం జేసికొనుచున్నారుకాన బ్రాహ్మణుల కందఱికి నది యుపాదేయమని చెప్పుచున్నారు. శాస్త్రవిరుద్ధకార్యములు బ్రాహ్మణులలో నొక శాఖవారు చేసినంతమాత్రమున నవి యాచరణీయములు కానేరవు. కాదుకూడదు. ఒక తెగవా రాచరించినను నది ప్రమాణమగునని మనపంతులుగారు పట్టుఁబట్టెదరేమో ? అటులేని వీరివలెనె మఱియొక సంఘసంస్కర్తగారుబయలుదేరి యుత్తరదేశమున బ్రాహ్మణులలో నొకతెగవారగు గౌడులు మత్స్యములను భుజించుచున్నారు. కాన మనమును మత్స్యభుక్కులమై కలియుగభీములము కావలయునని వాదింతురు. వారి బోధానుసారము మనము మత్స్యములను మెక్కవలసినదేనా ? ఇందులకు మనపంతుల వా రంగీకరింతురా ? అది తప్పుపనిగాన నంగీకరింపమందురా ? వారుచెప్పిన మత్స్య భక్షణమును, మనపంతులవారు చెప్పిన రజస్వలావివాహములును దప్పుపనులేకాన మేమాదరింపమని చెప్పినఁ బంతులవా రేమిచెప్పెదరు ? వా రేమిప్రత్యుత్తరము చెప్పెదరో కాని బాపట్లసంఘసంస్కరణసభలో జరిగిన వింతలవిశేషముల యుక్తులంగూర్చి యించుక ముచ్చటించుకొందము.

బా ప ట్ల సం ఘ సం స్క ర ణ స భ.

రెండేండ్లక్రిందట బాపట్లలో గుంటూరుమండలసభానుబంధముగాఁ గావింపఁ బడిన సంఘసంస్కరణసభకు మాలో శివపురపు వీరభద్రపాకయాజిగారు వెళ్ళియుండిరి. అందు సభ్యు లనేకవిషయములం జర్చించి తీర్మానించియున్నవారు. వానిలో నొకటి రజస్వలావివాహవిషయము. ఇది మిక్కిలి కనసొంపుగాను విననింపుగాను జర్చింపఁబడి నది. అందుపన్యాసకులు రజస్వలావివాహములు వేదశాస్త్రయుక్తిచరిత్రానుభవహేతు యుక్తములైనట్లు లోకతీర్మానమును బత్రమునందు వ్రాసి ముందుచదివి యటుపై నుప న్యసింపఁగడంగిరి. ఉపన్యసించునపుడు పత్రికలో వ్రాసిచదివిన వేదశాస్త్రచరిత్రాది విషయములను విడిచి యుక్తిప్రసంగములతో నుపన్యాసము ముగించిరి. అందు ముఖ్య ములు రెండుగలవు. వానినిమాత్ర మిచట వినిపించెదము.

(1) "మనము సాధారణముగా సంగడికిఁ (సంతకు) బోయి యొక యావును దీసికొనఁదలఁచితిమేని దాని పాదుగును జూచుకొని యెన్ని పాలిచ్చునో పిదికి పరీక్షిం చికదా తీసికొనుచున్నారము. అట్లే మన మొకకన్యకను వివాహము చేసికొనఁదలంచు కొన్నను దానిని బాగుగాఁ జూచుకొనియే చేసికొనవలయును" అని సెలవిచ్చిరి. దానిని విని సభ్యులు గొల్లున నవ్విరి.

(2) మన మొకగుఱ్ఱమును గొనఁబోయితిమేని దానికి సుళ్లు మొదలగునవి సరిగ నున్నవా లేవా యని పరిశీలించుకొని యటుపైనది వేగముగాఁ బరుగిడునో లేదో యని దానిపైనెక్కి కొంతదూరము చూచుకొని యపుడాగుఱ్ఱమును గొనుచున్నారము. అటులనే కన్యనుగూడ బాగుగఁ బరిశోధించి వివాహమాడవలసియున్నది. ఇపుడట్లు గాక 8, 9, ఏండ్లబాలికను దలిదండ్రులు దూరదృష్టి యూహింపక వారికిష్టమైనతోడనే తమ పుత్రునికి ముడివేయుచున్నారు. కాని యిది యనుచితమని చెప్పిరి.

మనసోదరులు గోవునుగొనఁబోయినవాఁడు ముందు పాదుగుఁజూచి పాలుపిండుకొని యటుపై గోవునుగొనినట్లు కన్యనుగని పరిణయము గావించుకొనవలెననియు గుఱ్ఱమునుగొనువాఁడు ముందు దానిపైనెక్కి చూచుకొని కొనినట్లు మనము కన్యను బరిశోధించి పాణిగ్రహణముఁ గావించుకొనవలెననియు వారి యాశయములను వెలిఁబుచ్చియున్నారు వింటిరా? ఎటువంటియుపమానములతో రజస్వలావివాహముల స్థాపింపఁ జూచిరో! ఇంతకంటె మోటుప్రసంగములు లోకమునందునా? ఈలాటిమాటలు సంస్కర్తలనోట వెడలినవి కాని పూర్వాచారపరాయణుల నోటినుండి వెడలియుండెనేని వెంటనె మనసోదరు లింకను వీరిని "బ్రాసిక్యూటు" ఏలచేయలేదని తొందరచేసియుందురనుటకు సందియములేదు. ఇంతియఁ గాదు. రజస్వలావివాహముల మాటతలంపఁగనె యింతచిన్నదిగానున్నఁ దమతల యింతదొడ్డగుచున్నదని చేతుల విప్పి చూపింపసాఁగిరి. అదివినికని సభ్యులు పకపక నవ్విరి వింటిరా! రజస్వలావివాహములమాటఁ దలంపఁగనే తలదొడ్డగుచున్నదఁట! వారిప్రాయమా! యేఁబది వత్సరములను సమీపించియున్నది. వారా! సంస్కర్తలు. స్థలమా! మహాజనసభారంగము. పనియా! ధర్మచర్చ. ఈసందర్భములో రజస్వలావివాహములను దలంచుకొనఁగనే వారితల యుబ్బి దొడ్డుకాఁదొడగిన నిఁక రజస్వలయైనపడుచును బరిణయముఁ జేసికొనఁబోవు పడుచువానితల యెంతయుబ్బి యెంత దొడ్డగునో కదా! వీరివాదమును విని మనతలగూడ దొడ్డగుననితలంచి వారివాదము నంగీకరించితిమా వెంటనే మఱియొక సంస్కర్త గారు జారత్వముతలంపఁగనే తమతల

దొడ్డగుచున్నదనియు, వేఱొక సంస్కర్తగారు చోరత్వమును దలంపగనే తనతల దొడ్డగుచున్నదనియుఁ జెప్పి జారత్వ చోరత్వములను సంఘమున నెలకొల్పుఁడని బోధింపఁబోత్తురు. వానినెల్ల మనము ప్రారంభింపవలసినదేనా? వీనిని మన సోదరు లామోదింతురా? ఈమాటలకేమికాని యీవెంటనే యుపన్యాసకుల వాదమును బలపఱచుటకై యొకసపోర్టరుగారు రంగస్థలము నధిష్ఠించిరి. వీరి కఱువదియేండ్ల ప్రాయ మున్నదని వారిరూపము చెప్పకయే చెప్పుచున్నది. ముసలివారికిఁగూడ రజస్వలావివాహములనఁగనే నోరూరఁజొచ్చినది. ఏమి! యీకలికాలమహిమ! అట్టిపై వీరు పదినిమేషములకాలము. శ్రీయుత ఆచంట లక్ష్మీపతి బి. ఎ. ఎం. బి. సి. యం. గారిని స్వయంవరవివాహము గావించుకొనిన సతీతిలకమును బొగడిపొగడి తుదకుఁ దమకు నేడ్గురు పుత్రికలు కలరని చెప్పుచు నం దైదవపుత్రికతో యీయవపుత్రికతో యీ లక్ష్మీపతిగారిపత్ని యీడుబిడ్డయైయున్నదికాన రజోదర్శనానంతరస్వయంవర వివాహము లవశ్యకరణీయములని చెప్పుట కింతకంటె నెక్కువకారణము నేమి తెల్పవలెనని యడిగిరి.

కంటిరా! స్వయంవరవివాహముల బలపఱచువారి కారణప్రదర్శనము! దీనినిగని మనము స్వయంవరవివాహములు ప్రారంభింపఁగానె మనతెలివినిఁగని పెట్టిన మఱియొక సంస్కర్తగారుభయులు దేరి«అదుగో! ఆవీధిని మద్యపానముఁజేసి మత్తెక్కి యొడలు తెలియకపడియున్నాఁడే యీరంగఁడు నా యూడవకోడలికిఁ దోడఁబుట్టినవాఁడు కాన మద్యపానము పరమపవిత్రమైనది. దీనింగూర్చి యింతకంటె నధికనిదర్శనము దేనినిఁజూపవలయును? కాన నీయాచారము త్వరగా నాచరణలోనికిఁ దెచ్చి సంఘము నుద్ధరింపుఁడని యుపదేశింప మొదలిడును. దానిని మన మంగీకరించి యాచరించవలసినదేనా? దీనిని మనసోదరు లంగీకరింతురా? ఈరీతిగా సపోర్టరుగా రుపన్యాసమును బలపఱచి యుపన్యాసవేదికను దిగినతోడనే గుంటూరుపురవాసులును, న్యాయవాదికుల శేఖరులును, సంఘసంస్కారశిరోమణులును, దేశోద్ధరణదీక్షాపరతంత్రులును, శ్రీ రామానుజాచార్యవర్యసాంప్రదాయసదాచారాచరణనిష్ఠాగరిష్ఠులును, సంఘోద్ధరణైకచిత్తులును, బూర్వాచారవ్యాజపూర్వకదురాచారబోధకపూర్వాచారపరాయణోపన్యాసానన్యసామాన్యవిమర్శనవ్యాసరచనాచాతురీధురీణులు నగు శ్రీమాన్ వింజమూరి భావనాచార్యులవా రుపన్యాసవేదిక ముందునడిచి సభ్యుల సభాధిపతుల నిట్లు వేడుకొనిరి. ఆదేమన.

«ఇప్పు డింతవఱకు నుపన్యాసకులు రజోదర్శనానంతర స్వయంవరవివాహములు వేదశాస్త్రవిహితములని తా ముపపాదించిన తీర్మానములో వ్రాసిచదివిరికాని యీప్ర

మాణములఁజూపి సిద్ధాంతముఁజేసియుండలేదు. అందువలన నీవిషయమై లోకులు వేఱు గాఁదలంతురు. నాకిదునిమిత్తములకాలమునవకాశమిచ్చెదరేని యాలోపమును బాపఁగలనని సెలవిచ్చిరి. ఆమాటవిని సభ్యులలో నీవిషయసంబంధమైన శాస్త్రచర్చవినుటయందు నాసక్తిగల సదస్యుల ముఖకమలములు వికసింపఁజొచ్చెను. వారికి సభాధిపు లవకాశమొసంగిరి. అటుపై శ్రీవారిట్లుపన్యసింప మొదలిడిరి. ఇట "సంస్కృతముఁజదివినపండితులనేకు లుండవచ్చును. వారందఱికిఁదెలిసినవిషయమే యిట నేఁజెప్పఁబోవునది. మనలోఁ బరాశరస్మృతియనునది యొకటి యున్నదఁటగదా. అందులో "అష్టవర్షాభవేత్కన్యా" యనుశ్లోక మున్నదఁట. అష్టవర్షాయనుమాటకుఁ బదియారేండ్లపడుచని యర్థమఁట. ఈ యర్థ మెట్లువచ్చునన నదేదో సంస్కృతవ్యాకరణములో నొకసమాసమున్నదఁటగదా! దానింబట్టి "అష్టవర్షా" యనుపదమునకుఁ బదియారేండ్లది యని యర్థమువచ్చునఁట. ఆసంగతి యిక్కడనున్న పండితులకుఁగూడఁ దెలిసియుండునని నాయభిప్రాయము. ఇంతేకాదు. మాయింటిలో దేవతార్చనఁజేసెడి యాచార్యులుగారుకూడ మావైష్ణవులకు ముఖ్యమైన పాంచరాత్రాగమమునందున రజస్వలావివాహము చేయవచ్చునని యున్నదని చెప్పినట్లుగా నాకుఁ గొంచెము జ్ఞాపకమున్నట్లున్నది. కాఁబట్టి యీ రజస్వలావివాహములు శాస్త్రీయములని నాయభిప్రాయము" అనిచెప్పి వారియుపన్యాసము ముగించినవెంటనే సభాధ్యక్షులును, నాంధ్రపత్రికాసంపాదకులును, సర్వధర్మమర్మజ్ఞశిరోమణులును, శైవమతాచారాచరణనిష్ఠాగరిష్ఠులును, పండితరాట్టులును నగు శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు సభ్యుల నవలోకించి యీ రజస్వలావివాహ విషయము మీయంగీకారమునకుఁ బాత్రమైనదేనా? యని ప్రశ్నించిరి. ఆసభయందుసమావేశమైయున్న 900మందిసభ్యులలో నించుమించుగా 9మందిసభాసదులు చేతు లెత్తిరి. మిగిలినవారు మౌనముద్రనువహించిరి. ప్రెసిడెంటుగారు "ఆల్ పాస్" అని తీర్మానించిరి.

ఆరీతిగా నుపన్యాసకులు 15నిమేషములలో ధర్మచర్చలు గావించుటయు నీవిధముగా సభాధిపులు సభాంగీకారమునుబడసి తీర్మానించుటయుఁ దటస్థించినపు డేధర్మములను మనముందిఁక నాచరించి బాగుపడక చెడునదేమున్నది? శ్రీమాన్ వింజమూరి భావనాచార్యులవారు సభలోనున్న పండితులకుఁదెలిసినవిషయమేయనియు నది శాస్త్రములోఁగూడ నున్నట్లున్నదనియు, దేవతార్చకాచార్యులవారుగూడఁ జెప్పినట్లు జ్ఞాపకమున్నదనియుఁ జెప్పఁదొడఁగిరి. ఇవియా శాస్త్రచర్చలు. ఈశాస్త్రచర్చ

లనువినియూ మనమాచరింపవలసినది. ఇట్లుఁజర్చింపఁబడిన విషయముల నేనా సభాధిపులు తీర్మానింపవలసినది. ఈతీర్మానముల నే నాపత్రికలు పొగడి జనులాచరించవలెనని ప్రోత్సాహపఱుపవలసినది! వహ్వా దేవహ్వా!

డాక్టర్. సర్. యస్. సుబ్రహ్మణ్యఅయ్యర్ కె. సి. ఐ. ఇ. గారు.

"వెడ్నసుడేరివ్యూ" యను పత్రికనుఁ వ్రాసిన "రజస్వలావివాహములు" అను శీర్షికఁగలవ్యాసమును సాంధ్రీకరించి 23-1-15 తేదిని సాంధ్రదినపత్రికయందుఁ బత్రికాధిపతులు ప్రకటించియున్నవారు. అందలివిషయములు పెక్కులు విమర్శనార్హములైయున్నవి. గ్రంథవిస్తరభీతిచే వానినెల్ల విమర్శించుటమాని స్థాలీపులాకన్యాయమున నందుఁ గొన్నిటినిమాత్రమే విమర్శించి యిందువ్రాయుచున్నారము.

(1) "హిందువులలో బ్రాహ్మణేతరులలో నూటికి 99 రజస్వలావివాహములే జరుగుచున్నవి. రజస్వలావివాహము చెల్లఁగూడదనినచో నీవివాహములన్నియు నశాస్త్రీయములే కావలసివచ్చును" అను నొకవాక్యమును వ్రాసియున్నారు. ఇంతకంటె విరుద్ధవాదము మఱియొకటి యుండనేరదు. బ్రాహ్మణేతరులలో 100కి 99 రజస్వలావివాహములే జరుగుచున్నవంట! ఈవాక్యము వీరికి లోకజ్ఞానము లేదనిచాటుచున్నది. బ్రాహ్మణేతరులు, వైశ్యులు, రథకారులు, జంగములు, సాతానులు, దర్జీలు, లోనగువారును నైయున్నవారు. వీరిలో బాల్యవివాహములేగాని రజస్వలావివాహములు లేనేలేవు. ఇట్లుండఁగా మన డాక్టరుగారు బ్రాహ్మణేతరులలో 100కి 99 రజస్వలావివాహములు జరుగుచున్నవనివ్రాయుట లోకజ్ఞానములేకపోవుటచేత నేయని మనము చెప్పకొనక తప్పదు. శాస్త్రాంగీకారముగలిగి రజస్వలావివాహములను జేసికొనుచున్నారనిచెప్పెడి క్షత్రియశూద్రులలోఁగూడ క్షత్రియులు రజస్వలావివాహములను మీరు గావించెదరాయని మమ్మనడిగినచో మే మామాటను నవమానముగాఁ బరిగణింతుమని దక్షిణదేశనివాసులగు క్షత్రియసోదరులే పండితులైనవారే మాకుఁ జెప్పియున్నారు. క్షత్రియులును బ్రాహ్మణేతరులేకదా! ఇట్లుండఁగా మన యయ్యర్ గారు "బ్రాహ్మణేతరులలో 100కి 99 రజస్వలావివాహములే జరుగుచున్నవనివ్రాయుట" లోకానుభవదూరమనుట కు సంశయింపవలయునా? రజస్వలావివాహములను గావించుకొనుచున్న శూద్రసోదరులయందైనను మన. కె. సి. ఐ. ఇ. గారుచెప్పినట్లు 100కి 99 రజస్వలావివాహములు జరుగుటలేదు. వారును 100కి 50 బాల్యవివాహములు గావించుచున్నారని నిరంటంకముగాఁ జెప్పవచ్చును. ఇక హిందూసంఘములోని శూద్ర

సోదరుల నందఱిని మాదృష్టియందుంచుకొని చెప్పినమాట. ఇట్లుండఁగాఁ దమదేశము నందు మొదలార్యులు, పిళ్లలు, నాయుళ్లు, లోనగువారు రజస్వలావివాహములు గావించుకొనుటఁజూచి హిందూసంఘములోని బ్రాహ్మణేతరు లందఱు 100కి 99మంది రజస్వలావివాహములఁ జేయుచున్నారని వ్రాయుట యత్యాశ్చర్యకరముగానున్నది. రజస్వలావివాహము చెల్లఁగూడదనఁగానే "వివాహములన్నియు నశాస్త్రీయములే కావలసివచ్చు" నట! ఏమి! యీ వాదము శూద్రులకు శాస్త్రీయములైన విషయములు వైశ్యులకును వైశ్యులకు శాస్త్రీయములైన విషయములు క్షత్రియులకును, క్షత్రియులకు శాస్త్రీయములైనవిషయములు, బ్రాహ్మణులకును శాస్త్రీయము లేకావలయునా? జాతిధర్మములకొన్ని భిన్నముగానుండఁగూడదా? బ్రాహ్మణుఁడు మాంసాహారముచేయఁగూడదనిన శూద్రులుచేసెడిమాంసాహారము నిషిద్ధముగునా? రాజు "ఖూనీ"చేసినవాని తలనఱికించుటకు నధికారముగలిగియుండిన క్షత్రియేతరులుకూడ నట్టియధికారముకలవారగుదురా? ఇట్టిప్రశ్నలెన్నియో నడుగవచ్చును. వానికేమి. బ్రాహ్మణులకురజస్వలావివాహములు నిషిద్ధములని చెప్పినంతమాత్రమున శూద్రులుచేసికొన్న రజస్వలావివాహములు నిషిద్ధములగునని మన డాక్టరుగారు చెప్పుటయే నిషిద్ధముగానున్నది. పినతండ్రికూఁతురు వివాహమాడుట సోదరీగమనమగునని హిందువులు నిషేధించిన మహమ్మదీయులు పినతండ్రికూఁతును వివాహమాడుట నిషిద్ధముకానేరదు. హిందువులు గోమాంసభక్షణము పరమపాతకకార్యమని నిందించిన మహమ్మదీయులు చేసెడి గోమాంసభక్షణము వారికి నింద్యముకానేరదు. కాఁబట్టిబ్రాహ్మణులకు నిషేధములైన రజస్వలావివాహములు శూద్రులకు నిషిద్ధములని చెప్పుట ప్రమాదజనితము.

మన డాక్టరుగారు మఱియొక యూపాతరమణీయమగువ్రాఁతను వ్రాయించియున్నారు. అదేమన? "బ్రాహ్మణులలో మాత్రము రజస్వలావివాహములు కూడవని యేశాస్త్రమందును విధింపఁబడలేదు" అనునది బ్రాహ్మణులకురజస్వలావివాహములు పరమ నిషిద్ధములని యిందు శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాసజ్యోతిశ్శాస్త్రసుశ్రుతాదిశాస్త్రచర్చలు సలిపినస్థలములందు నంతటను మేమిదివఱకు నిర్ధారణఁ జేసియున్నవారము. కాన మరల నిటనీవిషయమై ప్రత్యుత్తరము లనవసరములని వదలిపెట్టితిమి. ధర్మశాస్త్రములు బ్రాహ్మణులకురజస్వలావివాహముల నిషేధించియుండఁగా మన కె. సి. ఐ. ఇ. గారు "బ్రాహ్మణులలోమాత్రము రజస్వలావివాహములు కూడవని యేశాస్త్రమందును విధింపఁబడలేదు" అని వ్రాయుట; వీరు "ప్రధానభాషయగు సంస్కృతమునే పూర్తిగా మఱచిపోవుటవలనఁ దటస్థించినదని తోఁచుచున్నది.

హిందువులు సంస్కృతమును మఱచిపోయినారా? యని ప్రశ్నింతురేమో? దానికిఁ బ్రత్యుత్తరమును మనడాక్టరుగారే "క్రమక్రమముగా మాతృభాషయగు సంస్కృతభాషాభ్యాసమును జ్ఞానసమార్జనమును సంఘమున క్షీణించినవి" అని యిచ్చియున్నారు. దీనింబట్టి సంస్కృతభాషాజ్ఞానము మనసంఘములోఁ గొలఁదిమందియందు మాత్రమే యున్నదనియుఁ జాలమందియందు క్షీణించినదనియుఁ దెలియవచ్చినదికదా? ఇందులోఁ గొందఱు సంస్కృతభాషనే మఱచిపోయినారని మనడాక్టరుగారే "హిందువులు ప్రధానభాషయగు సంస్కృతమును బూర్తిగా మఱచిపోయిరి" అను వాక్యముతోఁ దెలిపియున్నారు. ఇందువలన సంస్కృతము మాతృభాషగాఁగల యార్యులు వృద్ధియైనకొలఁదిని నితరదేశములకు వ్యాపించి యచటనున్న భాషనే తాము మాట్లాడుచుఁ గ్రమక్రమముగాఁ దమమాతృభాషయగు సంస్కృతమును మఱచిపోయినారని వారి యభిప్రాయమును వెల్లడించియున్నారని తెలియవచ్చుచున్నది. అట్లు సంస్కృతమును మఱచిపోయిన యార్యులలో మనడాక్టరు సర్. యస్. సుబ్రహ్మణ్యయ్యర్, కె. సి. ఐ. ఇ. గారు ప్రధానులని తలంచవచ్చును. వీరు సంస్కృతమును బూర్తిగా మఱచిపోయినారు. అందువలన వీరు ధర్మశాస్త్రములనేమియు నెఱుఁగరు. ధర్మశాస్త్రము లెఱుఁగకపోవుటచేతనే "బ్రాహ్మణులలో మాత్రము రజస్వలావివాహములు కూడవని యేశాస్త్రమందును విధింపఁబడలేదు" అని వ్రాయఁగలిగిరి? లేకున్న వ్రాయరు.

హిందూసంఘమున హిందూధర్మశాస్త్రములననుసరించి యనుపనీతులగు బాలురు మరణించినపుడు వారికిఁ బరలోకక్రియలు వేదవిహితముగా జరుపుటకు వలనుగాదు. ఈ విషయము సర్వజనవిదితము. స్త్రీలకు వివాహమే యుపనయనము. అవివాహితలై యున్న కన్యల అనుపనీతులగు బాలురవలెనే వేదవిహిత పరలోకక్రియల కర్హలుకారు. స్త్రీల కుపనయనస్థానీయమైనకర్మ వివాహమేయని మేమిదివఱకిందు శ్రీమదార్యనారాయణమూర్తిగారి యుక్తివాదమునకుఁ బ్రత్యుత్తరము చెప్పెడిచోట విస్తృతముగా విన్నవించియున్నారము. సంశయింపగలవార లాపట్టుఁ జూచుకొందురుగాక. ఇది యిట్లుండఁగా మనడాక్టరుగారు "స్త్రీలకవివాహితలుగానుండు స్వాతంత్ర్యము సహజముగాఁ గలిగియుండినను రజస్వలాత్పూర్వ వివాహాచారమువలనఁ బ్రతి స్త్రీయును వివాహము చేసికొని తీరవలయునను నిర్బంధమేర్పడుచున్నది. కాన నట్టియాచారము సదాచారము కానేరదు" అను నొక సాహసాతిసాహసవాక్యమును వ్రాసియున్నారు

పురుషు లనుపనీతులై యుండుటకు సహజస్వాతంత్ర్యము కలిగియున్నారని శాస్త్రాచారములు చెప్పుచున్నవా? చెప్పుటలేదు. స్త్రీలకు వివాహమే యుపనయన

మని శాస్త్రములు ఘోషించుచున్నవి. ఇట్లుండ నవివాహిత (అనుపనీత) లుగానుండు టకు స్త్రీలకు సహజస్వాతంత్ర్యమెట్లువచ్చినది? వచ్చినదిపోండు. వారు మరణించిన పుడు పరలోకక్రియలు లోపించుటలేదా? లుప్తపిండోదకక్రియులగువారికి పుణ్యగతులు కలుగవని హిందూశాస్త్రము లన్నియు కోకొల్లలుగ ఘోషించుచుండుటలేదా? అట్లు ఘోషించుచుండఁగాఁ దమవేదశాస్త్రగ్రంథములవలను హైందవస్త్రీలకు నవివాహిత లుగనుండు సహజస్వాతంత్ర్య మెట్లువచ్చును? రాదు. గానపుడు "రజస్వలాపూర్వవివాహాచారమువలనఁ బ్రతిస్త్రీయును వివాహముచేసికొనితీరవలయునను నిర్బంధమేర్పడుచున్నది" అని మన డాక్టరుగారు విచారపడిన ఫలమేమి? రజస్వలలగువఱకు మనము కన్యలకు వివాహముచేయకయుంచినయెడల వారిలోఁ గొందఱు యావజ్జీవము నవివాహితలుగనుండుట కభిలషింపవచ్చును. అట్టివారికి మరణానంతరమునఁ బరలోకక్రియలు లేమిచేసి సద్గతులు సంభవింపకపోవును. అకీర్తులంచియే మనపూర్వులు స్త్రీలకు బాల్యమున వివాహము విధించియున్నారు. అటులేని క్షత్రియవర్ణములందు రజస్వలావివాహములు లేవా యని ప్రశ్నింతురేమో? వారిలో రజస్వలావివాహములు కలవు కాని పరలోకక్రియలు కలుగవను భీతిచేతనే వారు రజోదర్శనానంతరమునైనను బ్రతి కన్యకను విధిగా వివాహము చేయుచున్నారు. కాని యావజ్జీవము కన్య లవివాహితలై యుండుటకు నవకాశ మొసంగియుండలేదు. అట్టిచ్చుటను నాచారముకూడ లేదు. మన హైందవప్రభుస్థానములందుఁ గొందఱుకన్యకలుఁ దగినవరులు లభింపమిని నించుమించు 90సంవత్సరములవఱకు వివాహములేకుండ నుండి యామె మరణదినమునను పడినతోడనే సవతిప్రదములగు పరలోకక్రియలు సంభవింపవని భీతిలి యప్పటికిఁదగిన వరునిఁ గొనితెచ్చి యానాఁడు వివాహమును, మఱునాఁడు దహనమును గావించినవారు కొందఱుకలరని వినియున్నారము. విదేశములందుఁగూడ యావజ్జీవము నవివాహితలుగ నుండఁదలఁచిన స్త్రీసంఘమునందు నీతిబాహ్యప్రవర్తనము దినదినప్రవర్ధమానమగుచున్నదని యాదేశస్థులే వ్రాయుచున్నారు. ఆవ్యాసములను ముందు స్వయంవరవివాహములంగూర్చి ముచ్చటించుచోట వ్రాసెదము. అటుఁ జదువుకొందురుగాక. సర్వానర్థదాయకమైన యవివాహితలుగానుండు సహజస్వాతంత్ర్యము మన స్త్రీలకుఁగూడఁ గాఁవలయుననుకోరిక సంఘవినాశకులు కోరఁదగినదికాని సంఘసంస్కారులు కోరఁదగినది గాదని శ్రీయుతులగు మన డాక్టరు, సర్ యస్ సుబ్రహ్మణ్యయ్యర్ కె. సి. ఐ. గారు తెలిసికొందురుగాత

## సంస్కర్తలు రజోదర్శనానంతరస్వయంవరవివాహములు లోకానుభవయుక్తములని సాధించిరా?

కరువలికిఁ జలనగుణముండఁగా స్వయంవరవివాహములు లోకానుభవయుక్తములని మన సంఘసంస్కారసోదరులు సాధింపఁజాలరు అదేమి? బాల్యవివాహములనెఱుంగని విదేశీయులు స్వయంవరవివాహములవలన మహోన్నతపదవినంది సర్వసుఖాకరులై వెలయుచుండుట మనము విని కని యున్నవారము కామా? యని యడిగెదరా? ఈప్రశ్న యందు రెండుతప్పులు గనుపడుచున్నవి (1) విదేశములన్నిటిలో బాల్యవివాహములు లేవనుట (2) వారు స్వయంవరవివాహములవలన మహోన్నతపదవిని గనియున్నవారని చెప్పుట ఈతప్పులను నిరూపించుటకు ముందు స్వయంవరవివాహములన నేమో, యవి యెన్నితెగలుగనున్నవో, యవి యెవరిచే నెట్లు గావించుకొనఁబడినవో, వానివలనఁగలిగిన లాభనష్టము లేవియో, మనము తెలిసికొనుట యత్యవసరమైయున్నది. వధువు వరుని గాని వరుఁడు వధువును గాని వరించి చేసికొనువివాహము స్వయంవరవివాహమనఁబడును

ఈస్వయంవరవివాహములు రెండువిధములుగఁ గన్పట్టుచున్నవి అందొకటి పూర్వము మనక్షత్రియసోదరులచేఁ గావించుకొనఁబడినది. వారు తమ స్త్రీజాతియొక్క నీతి కేవిధమైనభంగము కలుగకుండ స్వయంవరవివాహములఁ గావించుకొనుచువచ్చిరి. ఆ స్వయంవరవివాహములను జేసినవారైనను దమకన్యలకు స్వాతంత్ర్యమిచ్చి నీయిష్టమువచ్చినవరు నన్వేషించి స్వయంవర వివాహముఁ జేసికొమ్మని పంపినట్లు కనుపడదు ఇఁకేమన కన్యాపిత ప్రపంచమునంగలరాజుల నందఱిని దనసదనమునకు రావించి యొకచో వారినందఱిని సమావేశముగావించి తనకూఁతును బిలిపించి యారాజచక్రమును జూపించి యిందు నీయిష్టమువచ్చినవరుని వరించుమనికాని మత్స్యయంత్రాదికములగు వరపరీక్షాకార్యములను నేర్పఱచి యందు జయమందినవానిని వరించుమనికాని చెప్పి యట్లువరింపఁబడినవరులకుఁ దమకూఁతులనిచ్చి పరిణయముఁ గావించుచుండెడివారు. దమయంతీ ద్రౌపదీ సీతావివాహము లిందులకు నిదర్శనములుగా మనము గైకొనవచ్చును. వానివలన గలిగినఫలము లేమన — ఆవివాహసమయములందెల్ల ఘోరసంగ్రామములు జరుగుట భార్యాభర్తృవియోగములు సంభవించుట లోనగునవియై యున్నవి. ఆసంగ్రామములందు వరుఁడు బ్రతికిన వివాహము జచ్చిన దశాహమును జరుగుచువచ్చినవి. కాని యీస్వయంవరవివాహములు క్షత్రియేతరసంఘములందు జరుగుచుండెడివనుటకుఁ

దగిన నిదర్శనము లేవియుఁ గానరావు. ఇపుడా స్వయంవర వివాహములను జనసామాన్యమునందు నెలకొల్పితిమేని నెందఱు మరణింపవలయునో వారికై యెందఱు శోకింపవలయునో యావివాహములకేగినవా రెందఱు కారాగారములవసింపవలయునో యెంత ధనవినాశము కలుగునో మనమీయెడ నెట్లు నిర్ణయింపఁగలుగుదుము? నిర్ణయింపలేము. కావున నీస్వయంవర వివాహములు రాజులకుఁ జెల్లఁదగినవి కాని జనసామాన్యమున కేమాత్రమును నాచరణలోనికిఁ దీసికొని రాఁదగినవికావు. ఈవివాహముల నెలకొల్పఁ బ్రయత్నించువారు సంఘవినాశకులు గాని సంఘసంస్కర్తలు గారు

ఇఁక రెండవతరగతి స్వయంవరవివాహములంగూర్చి ముచ్చటించుకొందము. ఇవి పాశ్చాత్యుల స్వయంవరవివాహములు. వీనినె మనసంస్కర్తలు తమలక్ష్యమునందిడుకొని తలఁచుకొనినపుడెల్ల నుబ్బి తబ్బిబ్బులాడుచున్నారు. పాశ్చాత్యులు తమకన్యలకు వరనిర్ణయమునకు వలయుస్వాతంత్ర్యమిచ్చి నీయిష్టమువచ్చినవరుని వరించుమందురు. వారును దిరిగితిరిగి చూచిచూచి తుదకెవ్వనినో యొకనిఁ బరిణయమగుచున్నారు. ఈస్వయంవరవివాహములు నీతిబాహ్యములనియు సంఘవినాశకరములనియు విదేశపండితప్రకాండులు వ్రాసిననవలలు వ్యాసములు మున్నగునవి వేనోళ్ళఁజాటుచున్నవి. పాశ్చాత్యులునిషిద్ధములని చెప్పుచున్న యీస్వయంవరవివాహములనె మనసంస్కర్తసోదరులు తమసంఘమున నెలకొల్పఁజూచుచున్నారు

ఇంతటితమయభీష్టమును దీర్చుకొనుటకై మనసోదరులు విదేశములందంతటను స్వయంవరవివాహములె జరుగుచున్నవికాని బాల్యవివాహములుజరుగుటలేదని చెప్పుచున్నారు. ఇదితప్పు. విదేశములలోఁగూడ స్వయంవరవివాహములులేనిదేశములు కలవు, బాల్యవివాహములుగలదేశములుగూడ నున్నవి. ఈవిషయములు సత్యములనుటకుఁగొన్ని సమాచారములను జూపుచున్నారము చూడుఁడు. సువర్ణలేఖవారపత్రిక సం 1 సంచిక 16 „స్త్రీలవృత్తాంతములు, చీనాబాలికలు" అనుశీర్షికక్రిందఁ బెండ్లిండ్లు నడుచుటను గూర్చి యిట్లు వ్రాయఁబడియున్నది. „వధూవరులను దలిదండ్రులేనిశ్చయింతురుగాని భార్యాభర్తలస్వయంవరపద్ధతిలేదు" దేశమాత 8-2-15 తేదిగల సంచికయందు „గ్రీసుదేశపుస్త్రీలు" అనుశీర్షికక్రిందవ్రాయఁబడినవ్యాసములో మనదేశమందువలె నాదేశమున బాల్యవివాహములుకలవనుటనుగూర్చి యిట్లువ్రాయఁబడియున్నది „బాలురకు 15 సంవత్సరములకును, బాలికలకు 12 సంవత్సరములకును శాస్త్రప్రకారము వివాహము చేయవచ్చును"

దీనింబట్టియితరదేశములలోఁ గొన్నిటియందు స్వయంవరవివాహములు లేవనియు మఱికొన్నిటియందు బాల్యవివాహములుకలవనియుఁ దెలియవచ్చినది కాఁబట్టి విదేశములం దంతటను స్వయంవరవివాహము లెయున్నవి కాని బాల్యవివాహములు లేవని మన సోదరులు చెప్పుట తప్పని చెప్పవచ్చును

విదేశీయులందువలెనె మనదేశమందును ముందు సుఖదుఃఖంబు లనుభవింపవలసిన వధూవరులు తమమనసునకునచ్చినవరవధువులను వరించి వివాహమాడుట శ్రేయస్కరముకాని తలిదండ్రులు తమ యిష్టప్రకారము వధూవరులనిర్ణయించి వివాహముచేయుట శ్రేయోదాయకముకాదు" అనికొందఱు వాదించుచున్నారు ఇదియు విదేశానుభవము లేనివారు చెప్పునదియె చూడుఁడు. సువర్ణలేఖవారపత్రిక సం 1 సంచిక 16 చీనాదేశవివాహములు "వరాన్వేషణమునను వధువు నెన్నుటలోను గుటుంబగౌరవమును జక్కదనమును మృదులస్వభావమును ముఖ్యముగఁ దలిదండ్రులు పరీక్షించెదరు తలిదండ్రులయెన్నిక వను బిడ్డలంగీరింతురు" వధూవరులు ఒకరికిబ్బందికలుగునని యొకరు సద్దుకొని పోవుదురు కాన నన్యోన్యము కుదురును" దేశమాత 3-2-15 తేదిగలసంచికను, "గ్రీసుదేశపుస్త్రీలు" "బాలికలను బాలురనుగూడఁ దలిదండ్రులె వివాహసంబంధము గుదిరింతురు. ఇట్లుగుదుర్చుటవలన దంపతులలో నెకలతలుకలుగుట లేదు" విదేశసమాచారము లీవిధముగాఁ దలిదండ్రులు వధూవరులనిర్ణయించిచేసిన వివాహములవలన నాదంపతులకు నేవిధములగుకలహములు లేక సుఖముగానుండురని చెప్పుచుండగా మనసోదరులు తద్విరుద్ధముగాఁ జెప్పుట విరుద్ధముగానున్నది

విదేశీయులు స్వయంవరవివాహములవలన వారు మహోన్నతపదవినందినారని తలంచుట రెండవతప్పని చెప్పితిమి. ఆవిషయ మిందున వివరించుచున్నారము ఈవిషయమై మేము ప్రత్యేకముగాఁ దెలుపుటకన్న మాకంటె సర్వవిధముల నుత్తములును, సంస్కృతాంధ్రాంగ్లభాషాపండితులును, దూరదర్శులును లోకజ్ఞానులు నగు బుద్ధిమదగ్రగణ్యు లిదివఱకువ్రాసినవ్యాసములలోనుండిఁ బత్రికలోనుకూలములగుభాగములను నిందుఁ బొందుపఱచినఁ జాలునని యాపనిఁ జేయుచున్నారము వానిలో ముందు దుర్విమర్శకవాగనుశాసనులగు బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రివారు శ్రీమదార్యమతబోధిని సం 7 సంచికాసముచ్చయమందు "కృష్ణాపత్రిక వింతమూర్ఖత" యనుశీర్షికక్రింద "యువతీవివాహములముచ్చటంగూర్చి యిట్లువ్రాసియున్నారు.

"ఏమీ! స్వయంవరణభగ్యమా! అట్టిమహాభాగ్యము హిందూదేశములోని బ్రాహ్మణులకు స్వప్నావస్థయందును లేదు. ఒకవేళ ముందెన్నడైన, కలుగవచ్చునేమో

కాని యిప్పటికి లేదు" అని రావుబహదరు కందుకూరివీరేశలింగముపంతులవారు యువతీవివాహములంగూర్చియు స్వయంవరముంగూర్చియు స్త్రీయచారిత్రములలో ముచ్చటపడంజొచ్చిరి వీరుసెలవిచ్చినమహాభాగ్యము మనలో నప్పుడే పట్టుటకు వలనుపడదు వేలకొలది విడుదలనిచ్చు న్యాయస్థానములు (Divorce courts) స్థాపింపంబడినతరువాత యువతుల స్వయంవరమును మనము పెట్టవలయును. వివాహపుటొడంబడికలవిడుదలనిచ్చువ్యాజ్యముల విచారించుటకై యేర్పడిన న్యాయస్థానము లొక్క అమెరికాదేశమందునే 2921 గలవు ఈమహాభాగ్యము మనదేశమునకుంబట్టినప్పుడుగదా స్వయంవరమహాభాగ్యము శోభించును, ఎదిగి యుక్తావయస్కజ్ఞానముసంపాదించుకొనినతరువాత వధూవరు లెంచిచేసికొనువివాహములు తుదకు మూన్నాళ్ళముచ్చటలు గానున్నవి లేకున్న వివాహపుటొడంబడికల విడుదలనిచ్చుటకిన్నిప్రయత్నములేల? వానినివిచారించుట కిన్ని న్యాయస్థానములేల? గోల్డుస్మిత్తను నింగ్లీషుకవి చెప్పినట్లుగా వధూవరుల యానందమంతయు వివాహమాడుటకు ముందేయుండును గాని వివాహమైనతరువాత నుండదు. వివాహమాడందలంచుకొను స్త్రీపురుషులు కొంతకాలమువివాహమునకుముందు కలసిమెలసి తిరుగుదురు దానికి కోర్టుషిప్పు (Courtship) అనిపేరు కోర్టుషిప్పులో నిద్దఱికి అనుకూల్యముకలిగెనేని వివాహముచేసికొందురు. లేకున్న లేదు. వివాహమైనతరువాతకంటె నీకోర్టుషిప్పుదినములలోనె యానందమెక్కుడుగానుండునని గోల్డుస్మిత్తిక్రిందిరీతిని వ్రాసియున్నాడు.

"Being convinced, by experience, that the days of courtship are the most happy of our lives, I was willing enough to lengthen the period"

ఇట్టిభాగ్యమునా మనరావుబహదరువారు మనబ్రాహ్మణులందుం గావలెనని యకోరుచున్నారు? చాలు! చాలు!! మనకుం గలలోంగూడ నిట్టివైభవము పట్టకుండుంగాక. యువతీస్వయంవరములున్నతావుల వివాహధర్మములనుగూర్చియు, ఆస్తినిగూర్చియు సంతానముంగూర్చియు, విడుదలలంగూర్చియు వధూవరులు సదా న్యాయస్థానముల కెక్కుచుందురు కన్యావివాహములుగలమనదేశమున నీదోషములు లేవు. ఈ విషయమైజ్ఞాననిధులని పేర్కొనంబడిన సర్. టి మాధవరావుగారిట్లువ్రాసియున్నారు

"Facts exceedingly creditable to Hindu society. A multitude of such facts might be categorically stated. The

following are some of them (1) Very rare suits by a husband against the wife for institution or restitution of conjugal rights (2) There are no suits whatever by a wife against the husband for the institution or restitution of those rights (3) There are no suits by either against the other for a divorce (4) Rare are charges of conjugal infidelity brought by either (5) Rare are disputes between husband and wife about property

హిందు సంఘమునకు విశేషకీర్తిని దెచ్చువిషయములు. ఇట్టివిశేషములరాశి నొకదానిని వరుసగా నీయవచ్చును. ఈక్రిందివి వానిలోఁ గొన్ని (1) వైవాహిక ధర్మముల ప్రవర్తనమునకుఁగాని నివర్తనమునకుగాని భర్త భార్యపైఁదెచ్చువ్యాజ్యములు మిక్కిలి అరుదు. (2) ఈధర్మములప్రవర్తన నివర్తనములకై భర్తలపై భార్యలు తెచ్చు వ్యాజ్యములు లేవు. (3) ఒకరొకరిపై విడుదలకై దెచ్చువ్యాజ్యములు లేవు. (4) వివాహసమయభంగములంగూర్చి యుభయుల తగవులును లేవు. (5) సంతానముంగూర్చి తగవులు లేవు, (6) ఆస్తినిగూర్చి భార్యాభర్తలలోఁ గలహములు లేవు

అని పై యింగ్లీషువాక్యముల తాత్పర్యము ఈవిశేషము లొక్క హిందూసంఘమునందే గలవని సర్. టి. మాధవరావుగారు వ్రాసియున్నారు ఇవియన్నియుఁ గన్యావివాహఫలములనియు వధూవరులెంచువారు తలిదండ్రులగుటవలన వచ్చిన ఫలములనియు బుద్ధిమంతులు గ్రహింపక నవలయును యువతులు స్వయంవరమున కారంభించిన నీతగవులన్నియుఁ గలుగను. మన్మథుఁడు గ్రుడ్డివాఁడని కవికులసార్వభౌముడగు షేక్స్పియరు వ్రాసియున్నాఁడు అట్టిమన్మథుఁడు కూర్చిన వివాహముయొక్క శోభ నడుగవలయునా ?

## పశ్చిమదేశములందలి భార్యాభర్తల పొత్తులు.

భార్యాభర్తల ఐకమత్యవిషయములో మనదేశమే మంచిస్థితియందున్నది. భార్యలనుగొట్టుభర్తలు మనదేశమునకంటె పశ్చిమదేశమునందే హెచ్చుగాఁగలరు. ఈవిషయమై మోనియరువిలియమ్సుదొరవారిట్లు వ్రాయుచున్నారు

"The number of wife-beaters is considerably smaller in India than in Europe or America"

(భార్యలనుగొట్టువారు హిందూదేశముకంటె యూరపునందును అమెరికాయందును హెచ్చుగాగలరు)

స్త్రీని గుణవృద్ధికై మర్దింపవలెనను నింగ్లీషుసామెత యొకటికలదు. దాని నీక్రిందనిచ్చుచున్నాను —

' A woman, a dog, and a walnut tree, the more they be beaten the better they be "

(స్త్రీయును, కుక్కయును, నక్రోటమును, నెంతమర్దించిన నంతగుణవృద్ధినందును) పశ్చిమదేశములందు భర్తలమర్దించు భార్యలునుగలరు. అదియీదేశమున లేదు ,,

ఇంతియగాదు. ఈస్వయంవరవివాహములు వృద్ధియైనకొలందిని స్త్రీలకు వివాహేచ్ఛ క్రమక్రమముగా సన్నగిలి వ్యభిచారముపాలగుచుందురు. ఈవిషయము నీదిగువనుదాహరించిన సమాచారము ధృవపఱచుచున్నది. చూడుఁడు ఆర్యమతబోధిని సం9 సంచిక9

"అమెరికా దేశమునందలి యవివాహితులసంఖ్య,, "అమెరికా దేశమునందలి యునైటెడ్ స్టేట్సులో వివాహమాడనివారు 17102009జనులుకలరనియు వారిలో వివాహముకాని యౌవనవంతులు 8102000లును యువతులు 9000000లు ననియు జనపరిగణనపులెక్కలవలన నీసడుమ తేలినదఁట! స్థూలదృష్టిచే కోటిడెబ్బదిలక్షలజనులు వివాహములేకయున్నారని చెప్పవచ్చుననియు నిది మిక్కిలి శోచనీయమగు నవస్థయనియుఁ బత్రికలు ఘోషించుచున్నవి. వివాహధర్మములఁగూర్చియును జాతిహైన్యముఁగూర్చియు విమర్శముచేయువార లీయంశమును ముఖ్యముగా గమనింపవలయుననియు నీయవస్థ మిక్కిలి నీతిబాహ్యముగానున్నదనియుఁ ప్రాజ్ఞులు నొక్కివ్రాయుచున్నారు- హిందూధర్మశాస్త్రములును క్రైస్తవధర్మశాస్త్రములును బోధించురీతిగా వివాహమునుఆధ్యాత్మికముచేయక పాశ్చాత్యులు దానిని కేవలలౌకికముచేయుటచే నీదోసఁగు పొసఁగుచున్నది. ఇది నాగరికవివాహముల (Civil marriage) వలనిఫలము. మనదేశమునందు వివాహములంగూర్చి ముచ్చటించువార లీయంశమును ముఖ్యముగా గమనింతురుగాక. వివాహ మింద్రియసుఖ సాధనమనుకొనుట తప్పు. కాన నాగరికవివాహము లెప్పుడును జయమునందవు ఈయంశమును బశ్చిమదేశపువివాహములు రూఢిఁజేయుచున్నవి. అమెరికా దేశమునందును, నింగ్లాండునందును, వేనవేలు వివాహముచేసికొనకయే కాలక్షేపముచేయుచున్నారు. ఆయా దేశములయందు వివాహ

మపజయమునందుచున్నదని ప్రాజ్ఞులు ఘోషించుచున్నారు'' ఇదేవిషయము సంయుక్త రాష్ట్రములోని "పెండ్లిండ్లు" అనుశీర్షిక క్రింద గృహాపత్రిక సం 12 సంచిక 88 లోఁ బ్రకటింపఁబడియున్నది ఆవ్యాసముచివరను బత్రికాధిపతులు తమయభిప్రాయ మీవిధమున నిచ్చియున్నారు

"స్త్రీలలోను బురుషులలోను ఎవరో కొందఱు కార్యదీక్షచేతనో, వైరాగ్యముచేతనో పెండ్లిలేక యుండవచ్చును. గాని కేవలము స్వేచ్ఛాజీవనముకొఱకు వివాహములేకయుండునాచారము జనసామాన్యములో వ్యాపించినయెడల దేశమునకుఁగలుగు హానికి మితముండఁజాలదు. వివాహపద్ధతులనుసంస్కరించు వారీవిషయమును బాగుగ యోజించవలసియుండును''

ఇంతవఱకు మీరు కనఁబఱచినసమాచారములంబట్టి విదేశీయులకు స్వయంవరవివాహము లనిష్టఫలదాయకములైయున్నవని తెలియవచ్చినది. ఐన నగుఁగాక. దాన మనకే మినష్టము! మనదేశీయుల కట్టిదూపద లెన్నటికిని ఘటింపఁజాలవు. మనసంఘసంస్కరసోదరులు చూడుఁడెన్నియో స్వయంవరవివాహములను గావించియున్నవారు ఆదంపతు లెంతేనిఁ జూడముచ్చటగా సుఖపడుచు ముందువారికి మార్గదర్శకులైయున్నవారని కొందఱుచెప్పవత్తురేమో? అది యనుభవదూరమైనమాట.

## స్వదేశస్వయంవరవివాహఫలములు.

### కన్యకుగర్భమగుట.

మనదేశమున నవీనాచారపరులు స్వయంవరవివాహనామక విషవృక్షవనమును బెంపొందింపవలెనని పలుప్రయత్నములు గావించి యేఁడెనిమిదివిషబీజములను నాటిరో లేదో యివికొలఁదిదినములలోనే యప్పుడే కొన్ని కాయలుకాచి ఫలములనీయ మొదలిడినవి. ఆఫలములఁ గొన్నిటిని మీయెదుటఁ బెట్టుచున్నవారము.

సంస్కృతాంధ్రాంగ్లేయ భాషాపండితులును, ధర్మాధికారివరేణ్యులును బ్రాహ్మణులును దత్త్వవిదులును నగు బ్రహ్మశ్రీ సావిలాలవేంకటశివావధానులు బి. ఎ. గారినిఁ గొలఁదికాలముక్రిందటఁ గొందఱము దర్శింపఁబోయితిమి. ప్రస్తావవశమున స్వయంవరవివాహములముచ్చటరాఁగా శ్రీవారు తమయనుభవములోనున్న యొకకథఁ జెప్పసాఁగిరి. అదేమనఁ?

పెద్దయుద్యోగములోనున్న తమమిత్రసత్తముల కొకరికి నిరువురుసుత లుదయించిరఁట! అం దొకతనూజాత కెనిమిదవయేఁడువచ్చినతోడనె యొక పచ్చరితుఁడగువరుని

కిచ్చి పరిణయము గావించిరఁట! పిదపఁగొంతకాలమునకు రెండవకూఁతునకును వివాహ యోగ్యకాలము సంభవించినదఁట! అందుచేతఁ దమమిత్రులు వరాన్వేషణమునకు నారంభము జేసిరంట! ఇంతలో భగవంతుఁడు ప్రతికూలుఁడై తమస్నేహితునిఁ బరలోకమునకుఁ బంపెనఁట! పిదప వారినారీరత్నము సంఘసంస్కారపక్షమువలంబించితానచిన్న కొమరితెకు స్వయంవరవివాహము చేయందలంచి రజస్వలయగువఱకు వివాహము చేయమానినదంట! అటుపైఁ దగువరుని నన్వేషించుచుండఁగనే యాకన్యకామణికి మూడుమాసముల గర్భమేర్పడినదంట! తరువాత నీవిషయమువిని యదివఱకు కాకన్యనువరింపఁదలంచియున్నవరులు దూరదూరముగాఁ దొలఁగిపోసాఁగిరంట! అనంతర మెక్కడ దిక్కులేకున్నదాని కక్కసుగఁడే దిక్కన్నసామెతననుసరించి యాకన్యను నావెయక్కసునకనికిచ్చి వివాహము గావించినదంట కంటిరా స్వయంవరవివాహవిషవృక్షమునందుఫలించిన మొదటిఫలమిది.

ఇదిరెండవఫలము దీనినిగనుఁడు. 1-11-14 తేదిగల సుదర్శనీపత్రికా రాజమున "సంస్కరణవృక్షఫలము" అనుశీర్షిక క్రింద నొకసమాచారము దెలుపఁబడియున్నది. ఇది కులభ్రష్టతారూపముగు రెండవఫలము "ఈనడుమ నొకరెవిన్యూఇన్స్పెక్టరుగారు తనకూఁతున కీడువచ్చిన దాఁకఁ బెండ్లిచేయకయుండె- బంధుమిత్రులందఱును బిల్లకీడువచ్చుచున్నను బెండ్లిచేయవని యడుగఁగా "దానిభర్తను నేనెట్లునిర్ణయింపఁగలను, ఈడువచ్చినతరువాత నదియే చూచుకొనుఁగాక" యని యుక్తిచెప్పుచువచ్చెను. అందుచే బంధుమిత్రులందఱును వీరి నెబ్బెట్టుగాఁ జూడఁజొచ్చిరి. ఇట్లుకొంతకాలము గడచిన తరువాత నాకాంత పత్యన్వేషణమునఁ బ్రసక్తయై తనతోఁ జిన్ననాఁటనుండియు నొకబడిలోఁ జదువుకొన్న "తామస్" అను కిరస్తానీవానిని వరించి యతనికిఁ దన్నిమ్మనితండ్రినిగోరెను. అప్పుడు తండ్రిగారు చేయునదిలేక యదివఱకే బంధువులు తన్ను వ్యస్తముగాఁ జూచుచుండుటచే తానుగూడ కిరస్తానీలలోఁ జేరి తనకూఁతును వానికిచ్చి పెండ్లియొనర్చెను. స్వయంవరవివాహములయొక్క ముచ్చట లివి" ఈముచ్చటను జదువుకొని మన దగ్గిరాలసూర్యప్రకాశరావుపంతులు బి. ఎ. గారు రవిపత్రికలో "ఈ శాసనము దొరతనమువారి కంగీకారమయ్యెనేని బ్రాహ్మణస్త్రీలు చండాలాది హీనజాతులవారి సంపర్కము నపేక్షించి కులహాని గావింతు"రని సాతురబ్రాహ్మణులువ్రాసిన మాట సార్థకమైనదని యొప్పుకొని యాసాతురబ్రాహ్మణులను "తమనైసర్గికరాతుసస్వభావమును ప్రత్యక్షము గావించుచున్న బ్రాహ్మణ సాతురు" లనిదూషించినందులకుఁ బత్రికాముఖమున క్షమాపణఁగోరుట విధియని తెలుపుచున్నారము.

15 10-14 తేదిగల సుదర్శనీ పత్రికయందు "వివాహవిచ్ఛేదము, ఒకధర్మవిష
యము. ఆదిపూడి గోపాలశర్మగారిట్లు వ్రాయుచున్నారు. "గడచినజూలై నెల 18
తేదీని చెన్నపురి ఏడుబావులవీధిలోఁగల మద్గృహంబునఁ జరిగిన మదీయపుత్త్రికయగు శ్రీ
మతి చంద్రమతీదేవియొక్క వివాహమునుగుఱించి మాయన్నగారగు నాదిపూడిసోమనా
థరావుగారును నింకను దక్షిణవారును వ్రాసిపంపినలేఖలీపత్రికారత్నమున ముద్రింపఁ
బడియుండినవి తమరందఱును జిత్తగించియే యున్నారు. కంచిభొట్ల లక్ష్మీనారాయణ
రావు వివాహమునకుఁ బూర్వము నాతోఁ జెప్పినసంగతులనుబట్టి నేను చేయుకార్యము
ధర్మమనియెంచి చేసితిని తరువాత మాఅన్నగారి యభిప్రాయమునుబట్టియు
దక్షిణవారి యభిప్రాయమునుబట్టియు నేను చేసినది అధర్మమని నాకుఁ
దోఁచినది. దానికిఁదోడు శ్రీలక్ష్మీనారాయణరావుచర్యలలోను వంచకత్వము
కానవచ్చుటయు అతఁడు నాకుటుంబములోని యాడువారిని బిడ్డలను బ
హుక్రౌర్యముతో బాధించుటకారంభించుటయు, నాపుత్త్రికయగుచంద్రమతి, లక్ష్మీనారా
యణరావుపెట్టుబాధలకును వంచకత్వమునకును సహింపక నాతో, నీవీచిన్నవానిలో
విద్యయున్నదనియా గుణమున్నదనియా ఏమున్నదని వీనికి నన్నిచ్చి వివాహముచేసితివి?
నాసమ్మతినిబుచ్చుకొనక నాకీవివాహమును జేసితివిగనుక నేను వేరొకవరునివరించి
వివాహమాడెదను; లేకున్న కన్యకగానేయుండి నాకాలమును విద్యాధర్మముల విని
యోగపఱుపఁగలనని, దృఢనిశ్చయముతో బలుకుటయు
నేనుచేసినది అధర్మమని చక్కగా నామనస్సున నాటిపోయినది. ఆ యధర్మ
మునకుఁదగినశిక్షల ననుభవింపవలసినవారము తలిదండ్రులము. కావున మేము కావలసి
నన్ని అవమతులను దూషణలను అనుభవించినదైనది. కంచిభొట్లలక్ష్మీనారాయణరావు
నకు మాకును సంబంధము తెగినట్లు లోకమునకు విదితమగురీతి జరుగవలసినవిధానమంత
యు నిన్న నవమినాఁడు సికిందరాబాదుపురమున అతఁడే జరిపివేసినాఁడు. కావున
మాచంద్రమతికి మంచివరుడులభించిన అక్షతయోనియైయున్న యామెను మరల శాస్త్రో
క్తరీతిని వివాహము జేయుటకు నేనునిశ్చయించుకొన్నాఁడను" అని కన్యాదాతలె వివా
హావిచ్ఛేదములకుఁ బ్రారంభించుచున్నా మనిబహిరంగపత్రికాముఖముల వెల్లడింప మొదలి
డియున్నవారు. ఇంకను గొన్ని యిట్టి శుభకార్యములుజరిగినమీఁద నీలాటిదృష్టాంత
ములు వెల్లడియైనపిదపఁ దలిదండ్రులతోఁ బనిలేకయే కన్యలు తమవివాహావిచ్ఛేదములం
గూర్చి పత్రికలయందుఁ బ్రకటింపఁగడంగుదురు. అందఱికిని మన కంచిభట్లలక్ష్మీనా

రాయణరావుగారివంటి సాధువులగుభర్తలే లభింతురా? లభింపక గండ్రగొండివాండ్రైన వెంటనే వివాహవిచ్ఛేదప్రవ్యాజ్యములు "దాఖల్"చేయకతప్పరు. ఇంతవరకు మనదేశమునవున్న న్యాయస్థానములు వేలవ్యాజ్యములతోడనే నిండి యూపిరాడకున్నవి. అవి యీ వ్యాజ్యములవిచారింపఁజాలవు. అపుడు విదేశములందువలెనె మనదేశమునందును వివాహవిచ్ఛేదన్యాయస్థానములు స్థాపింపకతప్పదు. ఈస్వయంవరవివాహములనుగూర్చి యొకపొత్తమునురచించి యందుఁజంద్రమతీలక్ష్మినారాయణస్వయంవరవివాహవిచ్ఛేదముంగూర్చి వినసొంపుగ విమర్శించియున్నవారు. వారెవ్వరనియందురా! కొన్ని యభిప్రాయభేదములెట్లున్నను నీస్వయంవరవివాహములంగూర్చి మీమాట మింతయును లేక సనాతనధర్మమును దమలక్ష్యమునందుంచుకొని స్త్రీయుక్తియుక్తముగను హేతుయుతముగను సహృదయహృదయంగమముగను, "రజస్వలావివాహవిమర్శ" యను గ్రంథమునురచించిన, సుదర్శనీపత్రికాధిపతులగు । శ్రీయుత కస్తూరిశివశంకరకవిగారని మనయాంధ్రసోదరు లెఱుంగుదురు గాత.

ఇట్లనిన మనమతగ్రంథములు మిక్కిలి క్రూరత్వమువహించి స్త్రీలకేవిధమైనస్వాతంత్ర్యముగాని గౌరవముగాని లేకుండ నడఁగియుండవలయునని బోధించినట్లె మనపూర్వాచారపరాయణులు వారిని సర్వవిధముల స్వతంత్రతావిహీనలంజేసి సమస్తగౌరవములును సర్వస్వాతంత్ర్యములును దమకె యుంచుకొని వారినిబాధించుచున్నారు. ఇదితగునాయని కొందఱు వాదించుచున్నారు.

ఈవాదమునందు రెండుతప్పులుగలవు. అవేమన, మనమతగ్రంథములు స్త్రీలకేవిధమైనస్వాతంత్ర్యముగాని గౌరవమునుగాని యీయఁగూడదనిబోధించినవనుట మొదటితప్పు. పూర్వాచారపరాయణులైన హిందువులు తమకాంతలను స్వాతంత్ర్యవిహీనలంజేసి గౌరవించుటలేదనిచెప్పుట రెండవతప్పు, ఈరెంటిని నిందు విమర్శించి సత్యమును వెల్లడించుచున్నవారము.

## మనమతగ్రంథములు స్త్రీస్వాతంత్ర్యగౌరవములను నిషేధించుచున్నవా.

లేదు. మనమతగ్రంథములు స్త్రీస్వాతంత్ర్య గౌరవములను నిషేధించుచున్నవని కొందఱు చెప్పుదురుకాని యిది మనమతగ్రంథములు తిన్నగా, జూచి చదువని దోషమువలనగలిగిన యనర్థము మనమతగ్రంథములు వారుచెప్పినట్లు స్త్రీలయెడఁ గ్రౌర్యమునువహించియుండలేదు. చూడుఁడు. వివాహమంత్రములలో 6వఖండ 5మంత్రము. "మూర్ధానంపత్యురారోహ ప్రజయాచవిరాడ్భవ. సమ్రాజ్ఞీశ్వశురేభవ, సమ్రాజ్ఞీశ్వశ్ర్వాంభవ ననాందరిసంరాజ్ఞీభవ, సంరాజ్ఞీఅధిదేవృషు" అనఁగా, భర్తకన్నైన

నాకుఁ బ్రధానురాలవు కావలసినది, పదిమందిబిడ్డలుగలదానవు కావలసినది. (అత్తమామలయెడను ఆడుబిడ్డలయెడను మఱఁదులయెడలను రాణివి కావలసినది. అని దీనియర్థము. దీనికే తరువాతిమంత్రము బలపఱచుచున్నది.

ఇట్లువివాహములో వరునిచే వధువునుగూర్చి నాకు ముఖ్యురాలవుగా నుండుమనియు మాజననీజనకులకును స్వసోదరీసోదరులకును రాణివి కావలసినదనియుఁ గంఠోక్తిగా మనమతగ్రంథమగు వేదము చెప్పించుచుండగా మతగ్రంథములు స్త్రీలయెడఁ గ్రూరత్వమును వహించినవనుటకంటెఁ గ్రూరత్వము వేఱుగానుండునా? స్త్రీల కింతటి స్వాతంత్ర్యగౌరవములను మనవేద మొసఁగియుండఁగాఁ గ్రైస్తవవేదము (బైబిలు) క్రైస్తవ స్త్రీల స్వాతంత్ర్యగౌరవములంగూర్చి యేమిముచ్చటించుచున్నదో చూడుఁడు.

క్రైస్తవనిబంధనము, కొరింథీ 14 అధ్యాయము. 160 వ పుట "స్త్రీలు సంఘములలో మౌనముగ నుండవలెను వారు లోబడియుండవలసినదే కాని మాటలాడుటకు వారికి సెలవులేదు. ఈలాగు ధర్మశాస్త్రము చెప్పుచున్నది. వారేమైనను నేర్చుకొనఁ గోరినయెడల యింట తమతమ భర్తలనడుగవలెను. సంఘములో స్త్రీ మాటలాడుట అవమానము" ఇట్లు విదేశీయమతగ్రంథములు స్త్రీలులోఁబడియుండవలసినదే కాని సభలలో మాటలాడరాదనియు, నట్లుమాట్లాడుట యవమానకరమనియుఁ, దెలియనివిషయములను నింటిలో భర్తలనడిగి తెలిసికొనవలయుననియుఁ జెప్పుచున్నవి. ఇందెవరిమతగ్రంథములు స్త్రీలయెడ గ్రూరత్వమును వహించి స్వాతంత్ర్యగౌరవముల నొసంగియుండలేదో? తెలిసికొంటిరా! మతగ్రంథములనుగనుగొనకయె మనసోదరులు వానియందు నిందలను మోపి దూషించుట దూష్యమని చెప్పకొనకతప్పదు.

పోనిండు. శ్రుతు లట్లుచెప్పినఁ జెప్పుగాక! మన మన్వాదిస్మృతులు మాత్రము స్త్రీలయెడ గ్రూరత్వమును వహించినవని యొప్పుకొనకతప్పదు. కనుడు మనుస్మృతి ౯ అధ్యాయము శ్లోకము ౩ "పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే, రక్షంతి స్థావిరే పుత్రాః న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అనఁగా బాల్యమునఁ దండ్రియు యౌవనమున భర్తయు వార్ధక్యమునఁ బుత్రులును స్త్రీలను రక్షించుచున్నారు. కాన స్త్రీ స్వాతంత్ర్యమునకుఁ దగదు. అని యింతకఠినముగాఁ జెప్పియుండలేదా! ఇది ధర్మవిరుద్ధము కాదాయని కొందఱడుగుచున్నారు. ఈశ్లోకమును బఠింపఁగనే మనువు స్త్రీలయెడలఁ గ్రూరత్వమువహించెనని తోఁచును గాని సవిమర్శముగా నీగ్రంథమునుజదివినయెడల నీశ్లోకమునకు మనసోదరులుపడిన యభిప్రాయము తప్పనియు మనువును మంత్రములవలెనె స్త్రీలకు

న్యాయ్యమైన స్వాతంత్ర్యగౌరవముల నొసంగినాఁడనియు, నామోదించి స్త్రీరవలయును ఈవిషయము మీకువిశదముకాఁగలందులకై మనుస్మృతిమూడవయధ్యాయములోని 55,56 60 శ్లోకములను నిందుఁ బొందుపఱచుచున్నవారము. "పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా, పూజ్యాభూషయితవ్యాశ్చ బహుకల్యాణమీప్సుభిః" అనఁగా ననేకకల్యాణములభిలషించు తండ్రులచేతను, అన్నదమ్ములచేతను, భర్తలచేతను, మఱఁదులచేతను స్త్రీలు గౌరవింపఁదగినవారును భూషణాదులచే నలంకరింపఁదగినవారును నైయున్నారు. అని దీనియర్థము.

"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః॥ అనఁగా నేగృహమందు స్త్రీలు పూజింపఁబడుదురో యాగృహమందు దేవతలు రమించుచుందురు ఏగృహమందు స్త్రీలు పూజింపఁబడరో యాగృహమందుఁ బనులన్నియు విఫలములగును. "సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవచ యస్మిన్నేవ కులేనిత్యం కల్యాణంతత్ర వైధ్రువం॥" ఏకులమునందు నెల్లప్పుడు భార్యచే భర్త సంతుష్టుఁడగుచున్నాఁడో భర్తచే భార్య సంతుష్టురాలగుచున్నదో యాకులమునందు శుభము తప్పకకలుగును. ఇది ధ్రువము. ఇట్లు చెప్పినమనువు స్త్రీలకు గౌరవమునీయలేదని చెప్పుటకంటె న్యాయదూరముగుమాట మఱియొకటియుండునా?

### ఇఁక స్త్రీలకు స్వాతంత్ర్యమీయలేదను రెండవతప్పును గూర్చి ముచ్చటించుకొందము.

మనుస్మృతి 9అధ్యాయము 11వశ్లోకము "అర్థస్యసంగ్రహే చైనాంవ్యయే చైవ నియోజయేత్, శౌచేధర్మేన్నపంక్త్యాంచ పారిణాహ్యస్యచేక్షణే" అనఁగా పురుషుఁడు తాను సంపాదించితెచ్చినద్రవ్యమును గాపాడుటయందును, దానిని వ్యయముచేయుటయందును, గృహపరిశుద్ధియందును క్రతువులు మొదలగునవి చేయునపుడు సహాయముచేయుటయందును భృత్యభోజ్యములను బచనముచేసివడ్డించుటయందును, భర్తృశుశ్రూషాదికమందును స్త్రీని నియోగింపవలయునని దీనియర్థము. ఇట్లు మనువు "అర్థము ప్రాణము ఆచార్యులవారియధీన,, మన్నట్లు సర్వమును దనసతీవశముకల్పించి యమెయిష్టానుసారముగా భర్తమెలంగవలెనని చెప్పియుండఁగా "పితారక్షతికౌమారే" యనుశ్లోకముఖమున స్త్రీలకుస్వాతంత్ర్యగౌరవమును లేకుండఁజేసినాఁడనుట ధర్మవిరుద్ధముకాదా? అట్లేని "నస్త్రీస్వాతంత్ర్యమర్హతి." యనువాక్యమునకు వినియోగమేమందురా? భర్తయాజ్ఞకు లోఁబడి స్త్రీ మెలంగవలెననియు స్వత్వాధికారము భర్తకేగాని భార్యకులేదనియు దానియభిప్రాయము, స్వత్వాధికారమాటెకు లేకుండఁజేయుటమాత్రము న్యాయవిరుద్ధముకాదా

యని యడిగెదరా? ఈప్రశ్నకుసమాధానము మేము చెప్పుటకన్న ఆంధ్రదేశములోని సంఘసంస్కారులనెడి యుత్సవవిగ్రహములకెల్ల మూలవిరాట్టని చెప్పదగిన శ్రీ రావుబహాదర్ కందుకూరి వీరేశలింగము పంతులు గారు రచించిన చంద్రమతియనునవల 41వ పుటయందుఁ జంద్రమతికి విద్యాసముద్రుఁడు చేసినబోధ సరియగు సమాధానమైయుండుటచే దాని నీక్రిందఁ బొందుపఱచుచున్నవారము "భార్య భర్తయొక్క యర్ధశరీరమని యెల్లమతములవారును జెప్పుదురు. వారేమియుఁ దమలో భేదమువిచారింపక సమస్తకార్యములందు నొక్కటిగాఁ బ్రవర్తింపవలయును ఒకకుటుంబమున కిద్దఱుయజమానులుండిన సాఁగనేరదు కనుక భగవంతుఁడు భర్తను యజమానునిగాను, భార్యను లోఁబడవలసినదానినిగాను సృజియించియున్నాఁడు. రాజుకంటె ప్రజ లొకవేళ బుద్ధిమంతులైనను రాజునకు లోబడినడచుట యెట్లువిధాయకకృత్యమో యట్లే భార్య యొకవేళ భర్తకంటె బుద్ధిమంతురాలుగను, రూపవంతురాలుగాను, విద్యావంతురాలుగాను నుండుటతటస్థించినను బెనిమిటికి కడఁగియే యుండవలెను. (ఈవాక్యములు మే మిదివఱకువిన్నవించినట్లు స్త్రీలకు స్వతంత్ర్యాధికారము లేదని నిరూపించియున్నవి) ఒకవేళఁ బురుషుఁడు కోపశీలుఁడై యక్రమముగాఁ గొట్టినను దిట్టినను దిరుగబడక సహనము కలిగి కూడఁగట్టుకొనిరావలయును. తొందరపడి భర్త యొక యక్రమమును జేయుచున్నను గోపముతీరిన వెనుక మంచిసమయములో మెల్లగా హితబోధఁ జేసి మంచిమార్గమునకుదింపఁ బ్రయత్నింపవలెను............ఇంటికిఁ గావలసినదానిని గడించి తెచ్చుట పురుషులపని, తెచ్చిన దానిని బొదుపుగా వాడుకొనుచుఁ దృణమైనను వ్యర్థముగాఁబోకుండ జాగ్రత్తపెట్టుట స్త్రీలపని............తాను మహారాజుకూఁతురైనను పెనిమిటికిఁ బరిచారికయే యగును గనుక తన కెంతమందిపరిచారికలున్నను మగనికిఁ గావలసినయుపచర్యలను స్త్రీ స్వయముగనె చేయవలయును............పుట్టినింటివా రెంతధనికులైయున్నను నుత్తమస్త్రీ భర్తయింటనే యుండఁగోరును. గాని పెనిమిటి బీదవాఁడని పుట్టినింటికిఁ బోఁగోరదు. స్త్రీకిఁ బుట్టినింటఁ దిను పరమాన్నముకన్న భర్తతోడి గంజియె చాలమేలయినది............వేయేల? పుణ్యవతియైన స్త్రీ యాలోచనచెప్పునప్పుడు మంత్రివలెను, బనిచేయునప్పుడు దాసివలెను, నాపదలయందు మిత్త్రునివలెను, నుండి పెనిమిటి కిష్టమయినరీతిని సమస్తవిషయములందును బ్రవర్తించును" ఈవాక్యరత్నములు మన్వాదిస్మృతులనుండియు హితోపదేశాది నీతిశాస్త్రములనుండియు సంగ్రహింపఁబడినవి, వీనినటనుండి సంగ్రహింపక శ్రీ లింగముగారు గ్రంథమునుండి గైకొనుటవలనఁగల

కారణము పూర్వులమాటలందుకంటె సంఘసంస్కారనాయకులవాక్యములందుసంఘసంస్కారుల కెక్కువగౌరవముండుననితలంచి వారిమాటలను బట్టియైన నీలాటివిపరీతవాదములు మానుకొందురేమో యను భ్రాంతిచే నిట్లు వ్రాసితిమి ఇంతవఱకు వ్రాసినదానింబట్టి హిందూమతగ్రంథములును హిందువులును స్త్రీలకుఁ దగిన స్వాతంత్ర్యగౌరవముల నిచ్చి యిచ్చుచు నీయనున్నారని విశదమగుచున్నది. ఇంతకుమించిన స్వాతంత్ర్యము స్త్రీల కొసంగినయెడ వారు స్వైరిణులై వివాహబంధములను విచ్ఛేదము గావించుకొని సంతానముగనుటకుగూడ విముఖులై సంఘవినాశమునకుఁ గారకులగుదురని చరిత్రజ్ఞాననిధులగు విదేశీయపండితులు వ్రాయుచున్నారు. ఆ వ్రాతను సంఘసంస్కారిశిరోమణియనందగు శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే నడుపఁబడుచున్న దేశమాయను పత్రికారాజమున 1—10—18 తేదిగలసంచికయందు "భావికాలపు స్త్రీలు నవీనాభివృద్ధిక్షీణదశను సూచించునా!" యను శీర్షిక క్రిందఁ బ్రకటింపఁబడియున్నది. దానినుండి ప్రకృతానుకూలమగు భాగము నిందు వ్రాయుచున్నారము. "పూర్వ మత్యున్నతదశ గాంచిన రోమక రాజ్యమందు చాలాకాలమువరకు స్త్రీలు తమభర్తల కమితోపచారములు జేయుచు ప్రఖ్యాతకీర్తి గాంచిరి. ఆ స్త్రీలు రోమకరాజ్యమునకు పరువుదెచ్చుసంతానమును బడయుచు మంచిగౌరవముతో బ్రదుకుచుండిరి. సుమారు520 సం॥ములవరకు రోమక రాజ్యమున భార్యాభర్తలొండొరుల విడనాడు యాచారములేదు. ఇంతపవిత్రమగుదాంపత్యమునకు ప్యూనికు యుద్ధములయనంతరము చలనముకలుగ నారంభించెను ఆ రాజ్య మున్నతదశకు వచ్చునప్పటికి గ్రామములనివసించు యారోగ్యవంతులగు కాపులు తమ గ్రామములవిడనాడి పట్టణముల కరుగ నారంభించిరి. వీరట్లు స్వగ్రామములువిడుచుట మొదలు వ్యవసాయ మంతరించ నారంభించెను. ఈవిధమున గొప్పపట్టణముల చేరిన వ్యవసాయదారులు క్రమముగ సేనలం దుద్యోగము సంపాదించుటతో వ్యవసాయ పరిశ్రమ క్షీణించి యాకాలపువారు పరదేశములనుంచి యాహారదినుసులను దెప్పించుకోనవలసివచ్చెను. అన్యదేశముల నాశ్రయించుకొననది మొదలు స్వదేశపైరు లంతరించి ప్రజలసౌఖ్యము తగ్గ నారంభించెను. దేశభాగ్య మధికమైనది మొదలు నీతిసంపద తగ్గెను. ప్రజలకు భోగకాంక్ష వృద్ధియయ్యెను. కార్యనిర్వాహణమం దుత్సాహము సన్నగిల నారంభించెను. బీదజనులు సయితము నైహికేచ్ఛలదగుల్కొని యవినీతిమార్గముల బడ నారంభించిరి. ఈకాంక్షలన్ని వృద్ధియైనకొలఁది స్త్రీలకు కుటుంబజీవనంబునందనురాగముతగ్గిస్వాతంత్ర్యమందభిలాష హెచ్చి యంతవరకుగల దాంపత్యబంధమునకు లోపము

గలుగ నారంభించెను. స్త్రీలకు భర్తలయెడఁగల విధేయతకుమారుగ పురుషులతో సమా
నస్వాతంత్ర్యముల బడయవలెనను కాంక్ష బుట్టెను. పిమ్మట కొంతకాలము పురుషులతో
వారు సమానస్వాతంత్ర్యముల ననుభవించిరి. స్త్రీల కిష్టముతప్పినపుడు వివాహబంధము
విడఁగొట్టుకొను స్వాతంత్ర్యముకూడ గలిగెను. వివాహమయినస్త్రీలకు గృహవిషయము
లందును ఆస్తులందును పరిపూర్ణమగు స్వాతంత్ర్యము లభించెను. ఇట్లుకొంతకాలమునడచి
నమీఁదట వివాహమందనూయతబుట్టి బ్రహ్మచర్యము ప్రబలమై శిశుజనము తగ్గనారం
భించెను. ఈదురాచారమువలన రాష్ట్రమునకుగలుగు నష్టమును గ్రహించి అగస్టసుచక్ర
వర్తి బ్రహ్మచర్య మాపుటకు కఠినిబంధనలు చేయవలసివచ్చెను. స్త్రీలు స్వాతంత్ర్య
మునకై వీధులెక్కినదిమొదలు రోమకప్రజల నీతి కృశించ నారంభించెను". ఈవ్యాస
మును బ్రకటించి దీనిచివరను బత్రికాధిపతు లీక్రిందిరీతిని దమయభిప్రాయమును వ్రా
యుచున్నారు. "ఈహితోపదేశ మాంగ్లేయ స్త్రీల కీయబడినను నన్నిదేశములకు సమాన
ముగ వర్తింపగలదు." ఇట్లభిప్రాయమిచ్చిన యీపత్రికాధిపతులె యీవిషయమును
మఱచిపోయి యీనడుమ "రజస్వలావివాహములచట్టము" అను శీర్షికక్రింద నొకవ్యా
సము వ్రాసి యందు రజోదర్శనానంతరస్వయంవరవివాహములు సంఘోపకారకము
లని యేమేమో వ్రాయుటయకాక వాని నామోదించినంతనె పూర్వాచారపరాయణు
లమీఁద నాకాశము విఱిగిపడదనియు దివారాత్రము లెప్పటివలె వచ్చుననియు లోనగు
తమచాతుర్యవచనములం గుప్పించి పైపెచ్చు పిచ్చిపిచ్చిసభలుచేయుచున్నారని పిచ్చి
వ్రాఁతల వ్రాయ మొదలిడిరి. ఇపుడీ సంఘసంస్కారులమీఁద నాకాశమువిరిగిపడుటచేతను
వీరికి దివారాత్రము లెప్పటివలె రాకపోవుటచేతను నీవెఱ్ఱిసంఘసంస్కరణసభలు చేయు
చున్నారుకాఁబోలు! పోలు! పోలు! ఆళ్లచేలో గుంటకతోలినట్లు యీమాత్రపుమాట
లను బ్రతివాఁడు నుపయోగించవచ్చును. వివాహములలో భోగముసానులను నాటపా
టలకుఁబిలిచినంతమాత్రముననే సంఘసంస్కారులమీఁద నాకాశము విఱిగిపడినదా? వీరికి
దివారాత్రము లెప్పటివలె వచ్చుటలేదా? వీరు భోగముసానులను బిలువవలదని చెప్ప
నేల? అందువలన సంఘమునకు హానిగలుగుననియా? అటులేని రజస్వలావివాహములవలన
హానిగలుగునని తలంచిన పూర్వాచారపరాయణులు వాని నేలయామోదింపవలెను? ఆ
మోదింపనిమాత్రముచేత వారుచేయుసభలు పిచ్చిపిచ్చిసభలనుటయు పిచ్చిగాని యవి
పిచ్చిసభ లెన్నటికిని గావు

## బాల్యవివాహములవలనబలహీనులగుబాలురును బాలవిధవలును ప్రబలుచున్నారు.

అని కొందఱు సంఘసంస్కారప్రియులు వాదించుచున్నారు. ఇందు బాల్యవివాహములు నష్టదాయకములనుటకు బలహీనులగుబాలురుదయించుట, బాలవిధవలువృద్ధియగుట, యను రెండుకారణములం జూపుచున్నారు. ఇవికారణాభాసములు కారణములెన్నటికిని గానేరవు. బాల్యవివాహమునకును బలహీనసంతానోత్పత్తికిని, మనవారుచూపెడిసంబంధము దీపాంధకారసంబంధమువలెనున్నది. బాల్యమున గర్భాదానముజేసికొనుట బలహీనమునకు గారణమగును గాని బాల్యవివాహ మెట్లుకారణమగును? ఇంతవఱకు బాల్యవివాహములను గావించుకొనుచున్న బ్రాహ్మణవైశ్యాదులు తమసంతానమునకు బాల్యమున వివాహముఁజేసినను గర్భాధానము (జోదర్భనా) నంతరముననే జరుపుచున్నారు. వారికి బలహీనతకల్గుట యెట్లు? కలుగదు. కాని వాదమునిమిత్తము వారుసెలవిచ్చినట్లు మనసంఘము బాల్యవివాహమువలన బలహీనమయినదనితలంచి యించుక విమర్శించుకొందము. సంఘాభివృద్ధి కెన్నిబలములుకావలయును? దేహబుద్ధిబలములు రెండు కావలయును. ఈవిషయమై యార్యమతబోధినియందు దుర్నివార్యక వాగనుశాసనులగు బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులవారు వ్రాసియుంచినవాక్యరత్నము నిందుఁ జూపుచున్నారము.

"ఒరులు వేనవేలు కన్యావివాహము లొనర్తురుగాక. యంతమాత్రముచే నయ్యది తగుకర్జమగునా? అంతమాత్రముచే నయ్యది లాభకరమగునా? కాదు. అనర్థదాయకమే. కన్యావివాహము సంఘమున కనర్థదాయకముగాఁబట్టి కన్యావివాహముచేసినందులకు దిట్టిరనుకొందమనినను నదియుఁ దగినదికాదు. ద్విజాలలోఁ గన్యావివాహములనర్థదాయకములుకావు. అంతఃపురరక్షణములేనివారియందు కన్యావివాహములె ముఖ్యములు ఏమన, నయ్యవియే పాతివ్రత్యమునునిలుపునవి-యువతీవివాహములు పాతివ్రత్యనమునకు వేరుపురుగులు ఈవిషయమును వివేకానందస్వాములవారిట్లువ్రాసియున్నారు.

The Hindus, to produce a little chastity in the race, have degraded all their children by child marriage which in the long run, has degraded the race. At the same time, I cannot deny that this child marriage makes the race more chaste. What would you have? If you

want the nation to be more chaste you degrade men and women physically by this awful child-marriage. On the other hand, are you safe on your side? No, because chastity is the life of a nation. Do you not find in history that the first death sign of a nation has come through unchastity? When that has entered, the end of the race is in sight. Where shall we get a salvation of these miseries then

కన్యావివాహములు దేహబలమును తగ్గించి జాతి నధమస్థితికిఁ దెచ్చునవి యనియు యువతీవివాహములు పాతివ్రత్యమును జెఱచి జాతి నాశనము నేగలిగించునని యునీ రెంటిలో నేదియు సంబంధింపవలసి యుండునని యు దీని తాత్పర్యము. కన్యావివాహములు నీతిబలమును హెచ్చించును. దేహబలమును తగ్గించును. యువతీవివాహములు నీతిని నాశనముచేయును దేహబలమును హెచ్చించును కన్యావివాహములు పాతివ్రత్యమును హెచ్చించియును గూడ జాతినిఁ గ్రిందికిఁ దెచ్చును. యువతీవివాహములు దేహబలమును హెచ్చించును గాని పాతివ్రత్యమును మూలనాశనముచేసి జాతికి తుదకు భంగము దెచ్చును. ఇట్లు వివేకానందులవారు లోకమునంతను దఱచి చూచిచూచి సిద్ధాంతీకరించిరి దేహబలముకంటె నీతిబలమునే ముఖ్యముగా నెన్నుకొనందగును. గాన బూర్వాచారపరులు కన్యావివాహములనే చేయుచున్నారు మఱియును యువతీవివాహములలోని కుళ్ళునంతను పాశ్చాత్యులు వ్రాసికొనియున్న నవలలు మనకు వ్యక్తీకరించుచునే యున్నవి. మన విటరానురిఫార్మరు గారగు రావుబహదరు కందుకూరి వీరేశలింగము పంతులవారు లోకోపకారార్థమై తెనిగించిన "వికారాఫువేకుఫీల్డు" అను నవలనే పరిశీలించి చూతము. గోల్డుస్మిత్తను మహాకవిచే" విరచింపఁబడిన యీగ్రంథరాజము యువతీవివాహములందుఁగల నైచ్యములను వెల్లడిచేయుచున్నది. థారను హిల్లను వాఁడు పెండ్లిచేసికొందునని పల్వురుయువతులను జెఱచియున్నాఁడు:—

"Alas! Papa! replied she, you are but little acquainted with his villainies he has been married already by the same priest to six or eight wives more, whom, like me, he has deceived and abandoned,,

అను వాక్యములు నేను జెప్పినదానిని దృఢిచేయుచున్నవి. గోల్డుస్మిత్తుగ్రంథములో నొక యధ్యాయమునకు పేరుదట.

"Scarcely any virtue found to resist the power of long and pleasing Temptation,,

అను మాటలు శీర్షికగా వ్రాయఁబడియున్నవి. ఈమాటలకు వ్యాఖ్యాత లీక్రిందియర్థమును వ్రాసియున్నారు.:—

"The heading (with reference to the context) means that even the most chaste woman may be led astray by a handsome, fashionable and brilliant man who persistently tempts her with the dazzling prospect of her becoming his wife (Virtue is here used in the restricted sense of chastity),,

(కథాసందర్భమునుబట్టి) యీశీర్షిక మిక్కిలి పాతివ్రత్యధర్మమునందుండు స్త్రీకూడ నొకసుందరపురుషుఁడు తన్నువివాహముచేసికొందునని యాశపెట్టి పరిచయమును గలిగించుకొనినప్పుడు పెడత్రోవలం ద్రొక్కునని బోధించుచున్నది. (ఇట నీతియనుపదము పాతివ్రత్యమనునర్థమున వాడఁబడినది.) అని వైదానియర్థము. ఇట్టి వనేకములుకలవు. యువతీవివాహము పాతివ్రత్యము నంతగా నిలుపఁజాలదు. యువతీవివాహములుగలదేశములలోఁ గన్యా రహస్యసంతానసంరక్షణశాలలు వేనవేలు స్థాపింపఁబడియున్నవి. (కన్యలు అనగా నవివాహితలు) రహస్యముగాఁ గనిపారవైచినశిశువుల నీశాలలవారు తెచ్చి పెంచి పెద్దలఁజేయుదురు. ఈశాల లుండినను గూడ వీధులంగల తూముకాలువల లోను చెఱువులలోను గన్యాజారశిశుకళేబరములు తఱచుగాఁ గాన్పించుచుండును. అమెరికాదేశములో నొకపురమున సర్వసామాన్యముగా నొకవ్యాధి పుట్టినది. అనేకుల కావ్యాధివచ్చుటనుబట్టి బుద్ధిమంతులగు వైద్యులు బహుజనులను బీడించుచున్న యీవ్యాధి సర్వజనులును వాడుకొను జలాశయములో నుండవలెనని యెంచి యాగ్రామమునఁ గల చెఱువునీటిని దోడించి వేయగా నందు వేలకొలది శిశుకళేబరములు కాన్పించినవి. అవియన్నియును గన్యలు రహస్యముగా గనిపాఱవైచిన శిశువుల కళేబరములైయున్నవి ఈయంశము బ్రహ్మవాదినియను పత్రికారాజములో నిదివఱకు ప్రకటింపఁబడియే యున్నది. కన్యలు కనిపాఱవైచిన శిశుశవములు పశ్చిమదేశములో వీధులలోఁ గాన్పించుచుండునని యభేదానందస్వాములవారు వ్రాయించియున్నారు. ఇంతయేల, స్వయంవరములున్న దేశములందు వివాహమునకే భంగమువచ్చుచున్నది అనేకయువతులు వివాహములు చేసికొనకుండఁగనే, మిత్త్రులతో నింద్రియసుఖములననుభవించుస్థితికి వచ్చియున్నారు. ఒకదొరగారును నొకదొరసానిగారును వివాహముచేసికొనకయే కాపురము చేయు

చుండుటను జూచి యొక మతబోధకుఁడు వారికడకుంజని వారిని వివాహముచేసికొనవల సినదని యెన్నివిధములఁజెప్పినను వినకపోవుటచేఁ దుదకాయువతి తండ్రికడకుంజని నీ కూఁతురు పెండ్లిచేసికొనకయె యొకపురుషునితోఁ గాపురముచేయుచున్నదికావునఁ గొంచెము మందలించి వివాహముచేసికొనునట్లు చేయుమనఁగా నాపె జనకుఁ డామతగురువుంగని "పిచ్చివాఁడా! ఈమెతల్లిని నేనువివాహముచేసికొనలేదు- మేమిద్దరము మిత్రభావముతోఁ గలసిమెలసి తిరుగఁగా నీమె పుట్టినది. కాన నీమెనిప్పుడు నేనెట్లు పెండ్లి చేసికొనకతప్పదని చెప్పఁగలను" అనిపలికెనఁట. ఈయంశము కొంతకాలముక్రిందటఁ బత్రికలలోఁ బ్రకటింపబడినది.

ఇప్పుడు పాశ్చాత్యులుపల్వురు గుత్తవివాహములఁ బెట్టఁజూచుచున్నారు. ఒకపొలము నొకరైతు గుత్తకు రెండేండ్లకో మూఁడేండ్లకో పుచ్చుకొనునట్లే నాల్గుమూఁడేండ్లు హద్దుపెట్టుకొని వివాహములుచేసికొనుట గుత్తవివాహము. గుత్త అయిపోఁగానే వెనుకటిభర్తకును భార్యకును నేవిధమగుసంబంధ ముండరాదంట. ఇంతయేల! వివాహధర్మమే హీనస్థితికివచ్చినప్పుడు చమత్కారము లెన్నియేనిం బుట్టునుగదా. పశ్చిమదేశస్థుల నీతినిగూర్చి నేన మతియొకలాగున వ్రాయఁబోవుచున్నానని భ్రమపడవలదు. అందు మహాపతివ్రత లనేకు లుండవచ్చును. యువతీవివాహమున నెక్కుడుహానికలదా కన్యావివాహమున నెక్కుడుహానికలదా యనువిషయమె మనకుఁగావలసినది. వివేకానందస్వాములవారు చెప్పినట్లుగా యువతీవివాహపద్ధతియందుకంటె కన్యావివాహపద్ధతియందుఁ బాతివ్రత్యధర్మమున కెక్కుడు స్థైర్యముకలదు. ఇంతయేల! శాస్త్రప్రధానమార్గమునగాక యుక్తిప్రధానమార్గమునఁ బాతివ్రత్యమునకు సందేలదని మూర్లేదొరవారు క్రిందిరీతిని సెలవిచ్చిరి. "Mr. Morley, it will be remembered, touched upon this subject in his work on Didrot, and answered it on one point at least very much like Moeterlink. Rationalism preserves many virtues but chastity finds no place in its connon." యుక్తిప్రధానమైనధర్మమిట్లుండును.

"రివ్యూ ఆఫ్ రివ్యూస్"అను ఇంగ్లీషుపత్రికలో నిట్లు వ్రాయఁబడియున్నది. Although it is a point of honour with the London Youths to marry their girls as soon as they are about to become

mothers, conjugal fidelity is a virtue practically unknown to them మఱియును హేరల్టుబెగ్బిగారిట్లు డెయిలిక్రానికిల్లను పత్రికలో వ్రాయుచున్నారు. "Fifty thousand unwanted children are born every year in the United kingdom to unmarried mothers (సీమలో నేఁటేట వివాహముకానికన్యలకు 50000 కానీనులు ఎవరికిని నక్కఱలేనివారు పుట్టుచున్నారు.

ఇవియన్నియుఁ గనియె వివేకానందస్వాములవారు బాల్యవివాహములు స్త్రీల పాతివ్రత్యమును నిలుపునవియై యున్నవని వ్రాసిరి. కావుననె యువతీవివాహముగల క్షత్రియులందును శూద్రులందును రాణివాసమును మనవారు పెట్టియున్నారు

క్షత్రియాదులు దేహబలము ముఖ్యముగా నుండవలసినవారు కావున వారియందు యువతీవివాహములు కలవు. పాతివ్రత్యరక్షణార్థమై రాణివాసమునున్నగునవి కలవు. బ్రాహ్మణులు బుద్ధిబలము కావలసినవారు గాని దేహబలము కావలసినవారు గారు. కావున నిట్టివారియందుఁ గన్యావివాహము పెట్టఁబడినది. దేహబలము తగ్గిన బుద్ధిబలము హెచ్చునని శ్రీవీరేశలింగముగారు స్వీయచరిత్రములో నిట్లు వ్రాసియున్నారు. "ఎవ్వరికైన నొకవిషయమున నొక న్యూనతయున్న పక్షమున నింకొకవిషయమున నాధిక్యమును గలిగించి యీశ్వరుఁడాలోపమును బూరించునని విద్వాంసులు చెప్పుదురు. ఈసత్యమును నాదృష్టాంతముచేఁ గొంతవఱకు స్థాపింపవచ్చును-ఆకాలమునందు నాకు దేహబలమెంతతక్కువగానుండెనో బుద్ధిబలమంతయెక్కువగానుండెనని చెప్పవచ్చును."

దీనినిబట్టి దేహబలము తగ్గినను బుద్ధిబలము తగ్గదనియు నంతియకాక మఱి హెచ్చుననియుఁగూడఁ దెలియవచ్చుచున్నది. యువతీవివాహములఁ జేసికొను శూద్రాదులకంటె కన్యావివాహముల గావించుకొను బ్రాహ్మణులె బుద్ధికుశలతకలవారై యున్నారు. మితిలేని దేహబలముగలభీముఁడు బుద్ధికుశలతలేనివాఁడు గానుండె- దేహబలములేని ధర్మరాజు మిక్కిలిబుద్ధివైశద్యముకలవాఁడుగానుండెను. రావణకుంభకర్ణవిభీషణులలోఁ గూడ నీతారతమ్యమె గాన్పించుచున్నది. కుంభకర్ణుఁడతి దేహబలముకలవాఁడు. కాని బుద్ధిమాంద్యము మిక్కిలి హెచ్చు విభీషణుఁడు దేహబలము చాలనివాఁడుకాని బుద్ధిచే నందఱ మించినవాఁడు. రావణుడు దేహబలబుద్ధిబలములచే వారిద్దఱికిని నడిమివాఁడు. ఇట్టియుదాహరణము లనేకముల నీయవచ్చును. గాన బుద్ధిబలప్రధానులగు బ్రాహ్మణాదులందుఁ గన్యావివాహములును

దేహబలప్రధానులగు క్షత్రియాదులందు యువతీవివాహములును నుండఁదగినవి. అట్లే యున్నవి." ఈరీతిగా సంఘక్షేమమును దమలక్ష్యమునందుంచుకొని ప్రాజ్ఞులెల్లరును వేదశాస్త్రలోకానుభవములను రజస్వలావివాహము లరిష్టదాయకములని యిదివరకె బోధించియుండఁగా వానినెల్లఁ జెడచెవినిఁబెట్టి "తాఁబట్టినకుందేటికి మూడేకాళ్ళు" నువాదమును వీడక రజస్వలావివాహములె కావలయునని కీచులాడుచు మీఁదుమిక్కిలి యాత్మగౌరవహానికరములగు శాసనములను నెలకొలుపఁ బాటుపడుటయేకాక కూడదనిచెప్పవచ్చినవారినెల్ల జెప్పరానిబూతులు పెట్టుచున్నారు, సంఘమును జక్కఁజేయువారు చేయవలసినపని యిదియేనా?

## సంస్కర్తలు బాల్యవివాహము లరిష్టదాయకములని నిరూపించినారా?

అది యాకాశకుసుమమువలె భాసిల్లుచున్నది. బాల్యవివాహము లరిష్టదాయకములని శుష్కోపదేశములు చేయుపట్లఁ జెప్పుదురుకాని మనసంస్కారులు తమయనుభవమును దెలుపవలసివచ్చినచోటనెల్ల నింతరీతిని బాల్యవివాహములు సంతోషదాయకములుగానే యున్నవని సెలవిచ్చియున్నారు, ఈవిషయమునుగూర్చి సంఘసంస్కారపితామహులనఁదగు శ్రీ రావుబహదూరు కందుకూరి వీరేశలింగముపంతులవారు స్వీయచారిత్రము 26వపుటను వ్రాసినవ్రాఁత నిట వ్రాయుచున్నాము.

"నాకుఁ బదమూడవయేటను నాసహధర్మచారిణికిఁ దొమ్మిదవయేటను బొమ్మలపెండ్లివలె మావివాహమహోత్సవము నడిచినది. పిండివంటలుతినుటయు వాద్యములు వినుటయు, వేశ్యల నృత్యమునుగనుటయు మాకప్పుడాహ్లాదకరముగానె యుండియుండును. సర్వానర్థమూలకమయిన బాల్యవివాహమువలన మాకుమాత్ర మనర్థము లంతగాఁ గలుగక యీశ్వరానుగ్రహమువలన మాదాంపత్యము సంతోషదాయకమే యైనది," అని వ్రాసియున్నారు. వింటిరా! మన లింగముగారి విచిత్రప్రసంగము.? సర్వానర్థకమయినబాల్యవివాహము వలనఁ దమకుమాత్ర మనర్థము లంతగాఁగలుగక తమదాంపత్యము సంతోషదాయకమె యైనదఁట! అదేమి? వీరు ప్రత్యేకసృష్టిలో నుదయించినారా? అందఱి కరిష్టదాయకములైన బాల్యవివాహములు వీరికి సంతోషదాయకములగుటకుఁ గారణమేమి? ఇట్లడిగిన వారు "ఈశ్వరానుగ్రహమువలనఁ దమకుమాత్రము బాల్యవివాహములు సంతోషదాయకములైనవని సెలవిచ్చియున్నారు. అదియేమి? ఈశ్వరాను

గ్రహము వీరియందేయున్నదా? బాల్యవివాహము నుగావించుకొనుచున్న వీరి సాటిమాన వసోదరులం దదిలేదా! వారికిలేనిసంతోషము వీరికెట్లుకలిగినది? పోనిండు. ఈశ్వరుని యనుగ్రహమునుబడయఁదగినసత్కర్మలు మీరుచేయకపోఁగా నసత్కర్మలుజేయుచుండుటచే మీపై నీశ్వరున కనుగ్రహములేదు. నే నసత్కర్మలు పరిత్యజించి సత్కర్మలాచరించుటచే నాకు సంతోషముకలిగించెనని యానతిచ్చెదరా? అటులేని తా మీశ్వరానుగ్రహమును నొక్కసారిగఁ బొందఁగొనఁదగినంతటిసత్కర్మము లేమిజేసిరి? ఏయసత్కర్మలఁ బరిత్యజించిరి? అని మనమడిగిన వా రేమి సెలవిచ్చెదరు? విధవలకుఁ బునర్వివాహములఁగావించి వారి కాజన్మాంతము దుఃఖము లేకుండఁజేయుట. దురాగతమైన హిందూమతమును దదాచారములను విసర్జించి పరిశుద్ధాస్తిక (బ్రహ్మ) మతమును దదాచారములను స్వీకరించుటయని యీశ్వరుఁడు శ్రీ లింగము గారి కింతటి వార్ధక్యదశలో భార్యావియోగదుఃఖమునుగలిగించి యంతటితోఁదనివిదీరక యన్నపానీయాదు లమర్చుటకై మంగమ్మగారి నాశ్రయింపవలసినంత కష్టస్థితినిఁ బ్రాప్తింపఁజేయుటకుఁ గారణమేమి అసత్కర్మల విసర్జించి విధవావివాహాది పుణ్యకార్యములొనర్చుటవలనఁగలిగినసుకృతమడ్డుపడి యీకష్టములు రాకుండ నేలచేయలేదు? భగవంతుఁ డేల యూరక యనుగ్రహము తప్పెను? దీనికి బలమైన కారణ ముండవలయును అవికొన్ని కనుపడుచున్నవి. అవేమన? శ్రీ వారు తాముతలఁచిన సంస్కరణకార్యజయమునకై శ్రుతిస్మృతిసూత్రాదుల కపార్థముగల్పించుట. వీరుపూనినసంస్కారముల నెదిరించినపండితులను దూషించుట పండితులను జంతువులకుఁబోల్చి పరిహాసనములువ్రాయుట లోనగుకార్యములు పెక్కుఁ గావించియున్న మాట సత్యమేకదా ఈసంగతి మనకిపుడేల? అవెంటనె మఱియొకవింతవాక్యమును వ్రాసియున్నారు. అదేమనఁ? "నాభార్యకు స్ఫోటకమువచ్చెను గాని యూచెడురోగమును నంగవైకల్యముగాని.........మొగమునిండ గుంటలుపడుటగాని కలుగలేదు. వివాహమైన రెండుసంవత్సరములకె నాకును ప్రాణముపోవలసినంతవ్యాధి వచ్చెను గాని ప్రాణాపాయము కలుగలేదు. మాయిరువురకు నిట్టియాపదలుతప్పుట భగవత్కటాక్షమువలనఁగాని బాల్యవివాహాఖ్యమహాశక్తియొక్క శుభవీక్షణముచేతగాదు" అనివ్రాయించియున్నారు. ఇదేమివిచిత్రము! తమభార్యకు స్ఫోటకమును దమకు వ్యాధియును వచ్చి యవి భగవత్కటాక్షమువలన నివారించినవఁట గాని బాల్యవివాహాఖ్యమహాశక్తియొక్క శుభవీక్షణమునఁ గాదఁట! లోకములో నెవరైనను వ్యాధులుగుదురుటకై బాల్యవివాహములనుగాని ప్రౌఢావివాహములనుగాని కావించుకొనుచున్నారా? ప్రపం

చమునందలి ప్రజలందఱును దమకు వ్యాధులువచ్చి నివారించినయెడ నావ్యాధి నివారణము భగవత్కటాక్షమువలననైనదని తలంపక బాల్యప్రౌఢావివాహాఖ్య మహాశక్తులకుభ వీక్షణములవలన వ్యాధులునివారించినవని తలంచుచున్నారా? అట్లెచ్చటనైన వ్రాసియున్నారా? లేదు లేనియెడ మనపంతులగారిటువంటివాక్యములను బ్రోగుచేసి పెద్ద పెద్దభాగములుగా రచించి "స్వీయచరిత్ర" ను వెల్లడించిన నేమిప్రయోజనము? వీరి కవసరానవసరవాక్యవిచారముతోఁ బనియున్నట్లు తోఁపదు. ఈవిచారముతో మనకేమి? వారు బాల్యవివాహములు మంచివని చెప్పిరికదా, ఇట్లన్నఁ బంతులవా రెంతసంఘసంస్కారులమని చెప్పుకొనినను బూర్వాచారసంస్కారబలముచే బాల్యవివాహములు మంచివని వ్రాసినారు కాని యీ వాక్యమువలన మాకంత తృప్తి గలుగుట లేదు. శ్రీయుత దిగ్గిరాల సూర్యప్రకాశరావు బి. ఎ. గారు చెప్పినట్లు స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చి "అత్యుత్కృష్ట నాగరికతకువచ్చి తమనాగరికతకు మూలాధారము స్త్రీల యౌన్నత్యమేయని వేయినోళ్ళఁ జాటుచు నిత్యము దానిని మనకు నిదర్శనము మాపుచు నతిబాల్యవివాహములమాటయే యెఱుఁగని" పాశ్చాత్యపండితులు బాల్యవివాహములు మంచివని వ్రాసియున్నయెడ వానిని మేము విశ్వసించెదముకాని స్వదేశీయులమాట నమ్మమనియుందురా? అటులేని ఆంధ్రవారపత్రిక 27-8-18 తేదిగలసంచికయందు "ప్రౌఢావివాహఖండనము" అనుశీర్షికక్రింద డాక్టరు యం. ఏ. యస్. పెంబ్రీ, యం, డి గారు వ్రాయించిన వాక్యరత్నముల వినిపించుచున్నవారము. వినుఁడు "వయసుమీఱి వివాహములుచేసికొనుట మంచిదికాదు. స్త్రీపురుషుల యారోగ్యమునకును, నీతికిని భంగకరము. రాష్ట్రమున కనర్థదాయకము. ఇదిగాక సంతానము క్షీణించును. పుట్టినవారైనను దుర్బలులుగనుందురు. ప్రౌఢావివాహితలకు జనించిన పిల్లలు తలిదండ్రులయొక్క బుద్ధిబలమువలన నుత్తములగుదురనునమ్మకము జీవశాస్త్రమునకు విరుద్ధముగనున్నది.........బాల్యవివాహములు చేయుట చాలమంచిది" అని చెప్పియున్నవారు ఇదివినినవెనుక సంస్కారులమాట మనము చెప్పఁజాలముకాని పూర్వాచారపరాయణులలో బుద్ధిగలవాఁడెవ్వఁడును మనసోదరులబోధవిని రజస్వలావివాహముల నంగీకరించు వాఁడుండఁడు. ఇంతియగాదు మఱియొక పాశ్చాత్యపండితుఁడు మనముకానించుకొనుచున్న బాల్యవివాహములు పరమోత్కృష్టములని తెలుపుటయేకాక యీబాల్యవివాహముల నెవ్వరేని నింద్యములనితలంచి వానిని సంస్కరింపవలెననియెంచెదరేని వారికంటె నింద్యులు ప్రపంచమున వేఱుగనుండరని వ్రాసియున్నవారు. ఈవిషయము మీకు బోధపడగలందులకై శ్రీయుత దేవరకొండ జగన్నాథరా

పు బి. ఎ. గారు 31-8-15 తేదిగల దేశమాతసంచికయందలి "గౌ॥ వి యస్. శ్రీని వాసశాస్త్రిగారి యశాస్త్రీయమైనబిల్లు" అను శీర్షికక్రిందవ్రాసిన వ్యాసమునందలి యీ పాశ్చాత్యపండితునివాక్యములను నీదిగువ లిఖించి దాని నాంధ్రీకరణమునుగూడ నిచ్చియున్నవారము కాన దయచేసి చదువుఁడు.

Mr Frederick Pincard's opinion about Infant marriages.

"The absence of self choice in India obviates the fluttering uncertainty under which English girls live it in parts to marriage a sense of destiny which has a beneficial effect on the after-life. A boy and girl in India grow up to the knowledge that they are destined for each other; they knew that their lives must be passed together and from their earlier years they learn to adopt themselves to their future conditions. It is universally admitted that compromise and concession from the solid basis of m atrimonial happiness, and the sense of destiny imparted by early marriage powerfully promotes a spirit of compromise. We must also understand that the Hindu marriage contract is inviolable and the course of life is inevitable. The minds of both parties are thus in the proper frame for making the best of things. These wise provisions have stood the test of centuries and by their results continue to proclaim their excellence.

All parties are united in opinion that Hindu marriage life is an exceptionally happpy state. No Reformer, however hystorical, has ever ventured to assert that Hindu marriages are other than happy; and this is the dearest proof of their excellent system, and the severe condemnation of those who are seeking to unsettle it "

"ఇంగ్లాండుదేశమునఁ గన్యకలు తమకు యుక్తవయస్సువచ్చినవెనుక తమతమ యిష్టాను సారమున భర్తలనువరించుటయే యాచారమైయున్నందున యుక్తవయస్సువలనఁగలిగెడు

మోహావేశముచేత నన్నివిధముల గుణవంతులైన వరులను నెన్నుకొనుట, సాధారణముగా జరుగక యనేకయువతులు మోహావేశముచేత భర్తలను వరించుటయుఁ బిమ్మట మోసపోతిమని విచారపడుటయుఁ జరుగుచున్నది. ఇట్లుగాక యిండియాదేశములోని కన్యకలకు వరనిర్ణయవిషయమై లేశమైన స్వాతంత్ర్యములేక పెత్తనమంతయుఁ దలిదండ్రులయందే యుండుటచే సుగుణవంతుఁడైనవరుఁడు దొరకునా లేదాయనుసంశయముండుటకుఁ గారణముకానేరదు. కన్యకలతలిదండ్రులే తమతమవిభవానుసారముగా నన్నివిధములఁ దమకన్యకలకుఁ దగినవరులను నిర్మోహదృష్టితోఁ జూచి చూపించి నిర్ణయింతురు కాఁబట్టి కన్యకలు తమకుఁ దలిదండ్రులునిర్ణయించినవరుఁడు విధిప్రాప్తుఁడని మనస్సమాధానముఁజేసికొని సంతుష్టమనస్కలై కాలముగడుపుదురు. వధూవరు లిరువురును దమవివాహము బ్రహ్మసంకల్పితమనుదృఢబుద్ధితో యావజ్జీవము నొకరినొకరు పరిత్యజించుటకువీలుకాదని పరస్పరమనోభావముల గుర్తెఱిఁగి యొకరిలోపముల నొకరు సవరించుకొనుచు గార్హస్థ్యధర్మములను నడుపుచుందురు. భార్యాభర్తలు పరస్పరము లోపాలోపములను గుణదోషములను క్షమాపూర్వకముగా సవరణఁజేసికొనుచుండుటయే గృహస్థాశ్రమసౌఖ్యమునకుఁ బ్రధానమార్గమని ప్రాజ్ఞులైన యందఱి తాత్పర్యమై యున్నది. అదిగాక హిందూవివాహధర్మమే మనఁగా మధ్యనువిడుచుకొనుటకు వధూవరుల కధికారములేదు. యావజ్జీవము కష్టమో సుఖమో యొకరితోనొకరు సమముగా వధూవరు లనుభవింపవలసినదే. కావునఁ గలిగినంతలో సంతుష్టహృదయులై వధూవరులు కాలమునుగడుపవలెను. ఈవైవాహికధర్మము లతియోగ్యములైనవని యనేకశతాబ్దములనుండి హిందూదేశమున జరుగుచున్న యాచారములనుచూచి యెట్టివారును గ్రహింపవచ్చును. ప్రాజ్ఞులైనవారందఱును హిందువులలోనున్న గార్హస్థ్యసౌఖ్యము మఱియొక జాతివారిలో లేదని యైకకంఠ్యముగా నంగీకరించుచున్నారు. ఆధునికపునరుద్ధారకులలో నెవరును హిందూవైవాహికసౌఖ్యలోపముల నెంచలేదు. హిందూవైవాహికపద్ధతులయొక్క యోగ్యతాసూచకములైన నిదర్శనములివిగాక మఱేవి? కావున నిట్టి చిరకాలస్థాపితములై సంపూర్ణగార్హస్థ్యసౌఖ్యజనకములైయున్న బాల్యవివాహాచారములను మార్పఁగలెనని ప్రయత్నించువార ప్రాజ్ఞతయు దూరదృష్టియు నింద్యములుగాని శ్లాఘ్యములుకావని విన్నవించుచున్నాను.,,

ఇంతవఱకుఁ జెప్పినదానింబట్టి బాల్యవివాహములవలన బుద్ధిబలవంతులును రజస్వలావివాహములవలన గొంతవఱకు దేహబలవంతులునుబుట్టుదురనిస్పష్టపడినది. బ్రాహ్మణులు

బుద్ధిబలసంతానమును గోరి బాల్యవివాహములను బెట్టుకొనియున్నారు. వానిని బోఁగొట్టుకొనిన బుద్ధిబలవంతులగు పుత్త్రిలను బోఁగొట్టుకొనినవారెరుఁగుదురు. బ్రాహ్మణులు బుద్ధిబలవంతులనుటకు రెండుదాహరణములనిచ్చి యీవిషయమును విడిచెదము.

ఇంచుమించు రెండువత్సరములక్రిందట మనలోని యాంగ్లేయవిద్యాధికులును, దేశాభిమానులు కొందఱు ప్రస్తుతమింగ్లాండునందున్న "ఇండియన్ సివిల్ సర్వీస్" పరీక్షను హిందూదేశమున స్థాపింపవలసినదనియు దానమూలమున ననేకులాపరీక్షకుఁ బోయి కృతార్థులై యాయుద్యోగపదవులనందుటకు ననువుగానుండుననియు వేడుకొనఁగా మనప్రభుత్వమువారు హిందూదేశములోని మహాజనులయభిప్రాయమును దెలిసికొనఁగోరి "రాయల్ కమీషనర్" అనుపేర నొకవిచారణసంఘమును మనదేశమునకంపిరి. వారు చెన్నపురికివిచ్చేసినపుడు జరిగిన సమాచారము పత్రికాపాఠకులందఱును నెఱిఁగిన విషయమె. అపుడాకమీషనర్లు "మీదేశములందలి బ్రాహ్మణులు తమజాతిధర్మములకు భంగముకలుగునని పరదేశగమనమును బరిత్యజించినను వందఁ గొందఱు తెగఁబడి యింగ్లాండునకువచ్చి "సివిల్ సర్వీస్" పరీక్షకువచ్చి చదువసాగిరి. వారితోఁబాటు బ్రాహ్మణేతరులును గొందఱు చదివియున్నారు. అందఱును జేరి గతవత్సరమున నూఱుగురు పరీక్షకువెళ్ళఁగా వారిలో ముప్పదిమంది పరీక్షయందుత్తీర్ణులైయున్నారు. ఆముప్పదిమందిలో నిఱువదెనిమిదిమంది బ్రాహ్మణులును నితరులు నిరువురుగాను నున్నారు. ఆ "సివిల్ సర్వీస్" పరీక్ష, యీదేశమందె పెట్టినయెడ బ్రాహ్మణులలో ననేకులాపరీక్షయందుఁ గడతేరుదురు. అపుడా యుద్యోగములు చాలభాగము వారిపాలె యగును. ఇతరజాతీయుల కంతగా లాభముండదని సెలవిచ్చియుండిరి.

పరీక్షకు 100గురుపోఁగా నందుఁగృతార్థులైనముప్పదిమందిలో 28మంది బ్రాహ్మణులైయున్నారు. బాల్యవివాహితలకుఁబుట్టి వీరు బలహీనులైనయెడల నెట్లుపరీక్షలో గడతేరిరి? రజస్వలావివాహితలకుఁబుట్టి బలవంతులైయున్న యితరజాతీయు లేలపరీక్షలోఁ గృతార్థులు కాలేదు? ఏబలమున బ్రాహ్మణులు కృతార్థులైరి. బుద్ధిబలముచేతనని చెప్పుటకు సంశయింపవలెనా? ఇఁక రెండవదానిఁగూర్చి ముచ్చటించుకొందము. మనపరిపాలకులు మహోదారమానసులుగావునఁ బ్రపంచమున నెవ్వరు గణితవిద్యయందధికులుకలరో తెలిసికొననెంచి "సీనియర్ ర్యాంగ్లర్" పరీక్ష యనుపేర నంకగణితవిద్యాపరీక్ష నొకదానిని నెలకొల్పిరి

అది మూడుసంవత్సరములుగడచినది. అందు మొదటివత్సరము పంజాబుదేశపుబ్రాహ్మణుఁడా(వీరిపేరు తెలియదు)పరీక్షకుఁబోయి కృతార్థుఁడై స్వదేశ జాతిఖ్యాతులను విఖ్యాతపఱచియున్నవాఁడు. రెండవవత్సరమున మహారాష్ట్రబ్రాహ్మణుఁడు "ప్రొఫెసర్ పరంజప్యే"యను మహానుభావుఁడా(వీరు ప్రస్తుతము పూనా ఫర్గూసన్ కాలేజి ప్రిన్సిపాలుగానున్నవారు)పరీక్షకరిగి యుత్తీర్ణుఁడై స్వదేశజాతులకుఁ గీర్తిఘటించెను. మూడవవత్సరమునఁ జెన్నపురి రాజధానినివాసులగు "త్యాగరాజన్"అను బ్రాహ్మణసత్తముఁడాపరీక్షకుఁజని యందుజయమంది స్వదేశజాతిగౌరవజయస్తంభమును నాటెను. ఇట్లు సర్వఖండవాసులను దమబుద్ధిబలమున మీఱి పరీక్షయందుఁ గృతార్థులై తమ జాతిఖ్యాతిని నాచంద్రతారార్కముగ నెలకొలిపిన యీ మువ్వురు బ్రాహ్మణులును బాల్యవివాహితలకుఁబుట్టి బలహీనులైయున్నవారే కాని రజస్వలావివాహితలకుజనించి దేహబలవంతులైయున్నవారు కారుకదా. వీరికిఁ బరీక్షలో జయమొసంగిన దేబలము? బుద్ధిబలము- అటులేని బాల్యవివాహములవలన నిరుపమానబుద్ధిబలముగల పుత్రు లుదయించుచుండఁగా నవి యనర్థదాయకములనిచెప్పెడి మనసోదరుల వాదమునువిని మారెడి పూర్వాచారపరాయణులు బుద్ధిహీనులగుటకు సంశయముకలదా.

అటులేని మనసంఘమునఁ బలహీనత లేదని చెప్పఁగలరా యందురా! అట్లువచింపజాలము. మనసంఘమున గొంత బలహీనతకలదు. కాని యది మనసోదరులుతలంచినట్లు బాల్యవివాహములవలనఁగలిగినది గాదు. ఇకేమన? శాస్త్రమర్యాదల నతిక్రమించి స్త్రీపురుషు లధికముగా సంగముచేయుటవలనఁగలిగిన బలహీనత. స్త్రీసంగమమును గూర్చి మను విట్లు చెప్పుచున్నాఁడు. అధ్యాయము.3శ్లోకము45 "ఋతుకాలాభిగామీ స్యాత్స్వదారనిరతస్సదా, పర్వవర్జం వ్రజేచ్చైనాం తద్వ్రతో రతికామ్యయా మానవుఁడు ఋతుకాలాభిగామియు స్వభార్యానిరతుఁడునై పర్వకాలములందు విడిచి మిగిలినకాలములందు రతికామముచేతఁ గూడవలసినది. దీనింబట్టి ఋతుకాలమునందు మాత్రమే స్త్రీసంగమము చేయవలసినదని తెలుచున్నది. ఇఁక ఋతుకాలమననేమో మనము తెలిసికొనవలయును. "ఋతుస్స్వాభావికస్త్రీణాంరాత్రయష్షోడశస్స్మృతాః। చతుర్భిరితరైస్సార్థ మహోభి స్సద్విగర్హితైః" స్త్రీలకు ఋతుకాలము సాధారణముగా 16దినములని చెప్పఁబడుచున్నది. అందు మొదటి4దినములు పెద్దలచే నిందింపఁబడుచున్నవి. దీనివలన మాసములో 16దినములుమాత్రమే ఋతుకాలమని తెలియవచ్చినది. ఇవియు

ష్ఠియు సంగమార్హములు కావు. "తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీచయా, త్రయోదశీచ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః" ఆ పదియారు దినములలో మొదటి 4 లును 11,13 రాత్రులును నింద్యములు. మిగిలిన 10 రాత్రులును స్త్రీసంగమమునకు ప్రశస్తములైనవని తెలియవచ్చినది. "యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు, తస్మాద్యుగ్మాసు పుత్రార్థీ సంవిశేదార్తవే స్త్రియం॥" ఆ ప్రశస్తములైన పదిదినములలోను పుత్రార్థియగువాఁడు సరిదినములందును పుత్రికను గోరువాఁడు బేసిదినములయందును స్త్రీతోఁ గూడవలయును. దీనింబట్టి మాసములో నైదుదినములు మాత్రమె స్త్రీసంగమము చేయవలసినదని తెలియవచ్చినది. "నింద్యాస్వష్టాసు చాన్యాసు స్త్రియో రాత్రిషు వర్జయన్ బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్" ఎవఁడు వర్జింపవలసిన 6 దినములను సమానాస్యాపూర్ణిమలను వర్జించి తక్కిన రాత్రులయందుఁ దనపత్నిని గలియుచున్నాఁడో వాఁడు గృహస్థుఁడైయుండినను బ్రహ్మచారియే యగుచున్నాఁడు. ఇందువలన మాసములో నాలుగుదినములు మాత్రమే స్త్రీసంగమమున కనుకూలములనియు నందుమాత్రమె సంగమము చేసి యితరదినములందు వర్జించినవాఁడు గృహస్థుడైనను బ్రహ్మచారి. (జితేంద్రియుఁడు) బలవంతుఁడుగా నుండుననియుఁ దెలినది.

సోదరులారా! ఇంతవఱకు మనధర్మశాస్త్రము చెప్పినప్రకారముగా మితసంగమము కలిగినవారమై యుండుమేని నెన్నటికైన బలహీనుల మగుదుమా? ఈయాచారమిప్పుడు మందునకైన మనలోఁ గానవచ్చుచున్నదా? విధినిషేధములు లేక సమయాసమయములఁ జూడక విచిత్రవీర్యునివలె మనసాంఘికులు నడుచుచుండుట లేదా? బాల్యవివాహములుమాని రజస్వలావివాహముల నేకాదు ప్రౌఢావివాహములఁ గావించుకొనినను నతిసంగమము చేయువారికి బలమెట్లుండును? ఉండనేరదు. సంఘక్షేమమునుగోరు సంస్కారులు సంఘము బలముకలదికావలెనని కోరెదరేని మున్ముందు నీయధికసంగమమును సంస్కరింపవలయును. దీనినివిడిచి యెన్ని సంస్కరణములఁ జేసినను నవి బూడిదలో వేసిన యాజ్యాహుతులవలె వ్యర్థములగును. "ఉండొకచోటనుండఁగా మందొకచోటఁ బెట్టిన ఫలమెన్నటికిని జేకూరదుకదా"

ఇంతఁ జెప్పినను దమపట్టువిడువక మనసోదరులు రజస్వలావివాహములను బలమునపేక్షించి చేయక తప్పమందురా? అప్పటికిని వీరికి బలసిద్ధి సందర్భశూన్యము. అదేమన? ఇప్పుడు బాల్యవివాహము గావించుకొనుచున్న సంఘములలో వివాహము గావిం

చుకొనవలసియున్న వధూవరులందఱును మనసోదరులవాదమునుబట్టి బలహీనులై యు
న్నారనుట నిర్వివాదాంశమేకదా బలహీనులైయున్న వధూవరులను రజస్వలానంతర
మున వివాహముచేసినంతమాత్రముననె వారిక బలవంతులగుదురు లెటులదయింతురు?
బలహీనమైన క్షేత్రములో బలహీనమైయున్న బీజమును ఋతుకాలములో నాటినను
నందు బలవత్తరమైనయంకుర మంకురించునని యేహేతుశాస్త్రజ్ఞుండైనఁ జెప్పఁగలఁడా?
చెప్పలేఁడు అటులేని మనసోదరులుపూనిన యీసంస్కారము నిరర్థకమగుచున్నది. ఇఁక
వారిసంస్కారము సార్థకమెట్లగునందురా? వృక్షశాస్త్రజ్ఞుఁడు చెట్లను నంటుగట్టినట్లు
మనకన్యలను నెమారాసాయబుగారికో యెయ్యాకూబయ్యగారికో యంటుఁగట్టి బలవ
త్తరములగు సంతతములను ఒడయువలయును అంతకన్న వేఱుపాయము కానరాదు.
దీనిని హిందూసాంఘికుల కంఠనాళములలో నూపిరియాడుచుండఁగా నామోదింపరని
దృఢముగాఁ జెప్పవచ్చును దీనితో సంఘసంస్కారులు చూపెడి మొదటి హేతువు
నిరసింపబడినది

ఇఁక «బాల్యవివాహమువలన బాలవిధవలు ప్రబలుచున్నారు» అను రెండవహే
తువుంగూర్చి ముచ్చటించుకొందము మనసోదరు లీవిషయమునుగురించి వ్రాయునపుడు
గాని యుపన్యసించునపుడుగాని పాఠకులయు శ్రోతలయు గుండెలు బ్రద్దలగునట్టులొక
చెన్నపురి రాజధానియందె యిన్నిలక్షల బాలవిధవలున్నారని పెద్ద పొడుగైనయంకెల
మొత్తమును జూపించి వీరందఱును బాల్యములో వివాహముచేయుట వలనవచ్చిన వైధ
వ్యఫలమును ననుభవించుచున్నారు» అని మిగుల జాలికలుగునట్లుగా వ్రాయుచునుపన్య
సించుచు నుందురు ఇంతియగాక 6-2-15 తేదీగల యాంధ్రదినపత్రికయందు శ్రీయు
తార్యనారాయణమూర్తిగారు మాలో శివపురపు వీరభద్రపాకయాజిరజస్వలావివాహ
శాసనముంగూర్చివ్రాసిన వ్యాసముం బురస్కరించుకొని కొన్నియవ్యక్తాలాపములను
వ్రాయుచు నందు మొదటిప్రశ్న యిట్లు వేసియున్నవారు(1) మనదేశమున విధవలసం
ఖ్య హెచ్చుటకు నుత్పత్తిస్థానమేది? అని ప్రశ్నించియున్నవారు దీనింబట్టి బాల్య
వివాహములను బాలవిధవాభివృద్ధికిఁ గారణములుగా మనసంస్కారులు దలంచుచున్నట్లు
తోఁచుచున్నది, దీనిని వినగా నె సత్యాసత్యవిమర్శజ్ఞానములేని పూర్వాచారపరాయణ
మానసములుకూడ సందిగ్ధసాగరమునఁ బడి కొట్టుకొనుచున్నవి. కాన నీవిషయమును
బిట్టుఁజర్చించి గుట్టు బైటఁబెట్టవలసియున్నది ఆర్యులారా! మనము కన్యలను బాల్య

మున వివాహము గావించుటకును బాలవిధవలు వృద్ధియగుటకును సంబంధమేమి? మనము వివాహముచేసిన బాలికలు సువాసినులగుదురు కాని విధవలగుదురా? కారు. కానిచో బాల్యవివాహములవలన బాలవిధవలు వృద్ధియగుచున్నారని చెప్పిన, వివేకవంతులెట్లామోదింపవలెను? ఇది పృష్ఠతాడనమున దంతభగ్నమైనట్లున్నది. ఇది యిట్లుండనిండు. ఏదేశమునందైనను భర్తలుచనిపోయినభార్యలు విధవలగుచున్నారా? లేక వివాహము చేయుటవలన విధవలగుచున్నారా? భర్తలుజచ్చుటవలననె భార్యలు విధవలగుచున్నారు కాని వివాహమువలన విధవలగుట లేదు, అటులేని విధవలసంఖ్యగని విచారముగొని సంస్కరింపఁదలచుకొనిన సంస్కారులు చేయవలసినపని భర్తలు చావకుండునట్లుగఁజేయుటయో చావకుండునట్టి భర్తలకు బాలికల నిచ్చుటయో యైయున్నది. కాని బాలికకు బాల్యమున వివాహముమానినఁ జావనున్న పురుషుఁడు చావక బ్రతుకుటయెట్లు? బ్రతుకనేరఁడు. ఈవిషయము సుబోధకమగుటకై దృష్టాంతమునొకదానిని దీసికొందము. యజ్ఞదత్తుఁడను పూర్వాచారపరాయణుఁడైన బ్రాహ్మణుఁడెనిమిదేండ్లయీడుగల తనకూఁతును నూఱుసంవత్సరముల పరిపూర్ణాయుష్యము కలిగి వివాహమునాఁటికి 24 ఏండ్లవయస్సులోనున్న యొక బాలునకిచ్చి వివాహము గావించినాఁడని తలంచుకొందము అపుడు బాల్యవివాహదోషమువలన నూఱేండ్లుజీవించవలసిన యాబాలునియాయుష్యము క్షీణించి వెంటనె మృతినందుననియు, నాతనిభార్య విధవయగుననియు, వివేకముగలవాఁడు చెప్ప సాహసించునా? సాహసింపఁడు. ఏమని చెప్పును? ఆదంపతులు సుఖముగ నూఱువత్సరములు జీవింతురనియు చెప్పును ఇది యిట్లుండనిండు.

దేవదత్తుఁడను నొకసంఘసంస్కారి రజస్వలయై16ఏండ్లప్రాయములోనున్న తనకూతుఁను నిఱువదియేండ్లకుఁ జావనున్న వాఁడును నగు వరునకిచ్చి పరిణయముఁ గావించినాఁడని తలంతము. అపుడా రజస్వలావివాహమహిమవలన 20ఏండ్లకుఁజావనున్న యావరుని యకాలమృత్యువు నశించి యతఁడు నూఱేండ్ల పరిపూర్ణాయుష్యముగలవాఁడును నాతనిభార్య దీర్ఘసుమంగలియును నగుదురా? కారు కానిచో రజస్వలావివాహము వలన విధవలసంఖ్య తగ్గునని చెప్పెడిబోధ వివేకముకలవాఁడు వినునా? వినఁడు. ఇంతవఱ

ను(జెప్పినదానింబట్టి తేలిన సారాంశ మేమనఁగాఁ? బాలికను గాని రజస్వలను గాని దీక్షాయుక్తంతునకిచ్చిన విధవలు కాక సువాసినులు గానె యుండురనియు నల్పాయుష్కంతునకిచ్చిన విధవలగుదురనియుఁ దెలియవచ్చినది. అటు లేని చాలవిధవలసంఖ్యఁ దగ్గింపఁదలఁచినవాఁడు బాల్యవివాహములమానుట పని కాదు- చేయవలసినకార్యము మఱియొకటియున్నది. అదేమన? పురుషులలోఁ బుట్టినవత్సరము మొదలుకొని పది వత్సరములలోపల నెందఱుజచ్చుచున్నారు? పది మొదలుకొని యిరువదేండ్లలోపల నెందఱు మరణించుచున్నారు? ఇరువది మొదలుకొని ముప్పదేండ్లలోపల నెందఱు కాలధర్మమునొందుచున్నారు? అని బాగుగా విచారించి యేయేతరగతులలో నేతరగతిపురుషులయందు చావులు తక్కువ గాఁగనఁబడుచున్నవో యాతరగతిపురుషులకె కన్యలనిచ్చి వివాహములఁజేసి యధికమరణములుగల మిగిలినతరగతులబాలురకు వివాహములుమానితిమేని బాలవిధవలసంఖ్య తగ్గును. కాని బాల్యవివాహములమానుట వలన బాలవిధవలసంఖ్య తగ్గునా? తగ్గదు. అట్లేని సంఘమును జక్కఁజేయఁదలఁచిన సంస్కర్తగారు చేయవలసినపని యేమో యిప్పుడైనమనసోదరులు గ్రహింతురా? గ్రహింపఁగలరని మానమ్మకము- ఊరక గ్రహించుట యుకాక యిట్టియసందర్భవాదముల నెన్నటికిని జేయకయుందురనికూడ విశ్వసించుచున్నవారము. కాదేని వీరిబోధ యింక వివేకముగలబాలుఁడుకూడ వినఁడని మనసోదరులు నిశ్చయించుకొనవచ్చును.

## బాల్యవివాహములు మహమ్మదీయబలాత్కారజన్యములా?

మనసంఘసంస్కారప్రియసోదరులు తాము పూనిన రజస్వలావివాహసంస్థాపనమునకు బాల్యవివాహములు మధ్యకాలాగతములని తెలుపుట బలవదాధారము గాఁ గనుపడుటచే వారిలోఁ గల్పనాకథాకల్పనానల్పజల్పనచాతురీధురీణులగువా రెవ్వరో బాల్యవివాహములు మహమ్మదీయబలాత్కారజన్యములను నొక కట్టుకథను గల్పించి పత్రికలలోఁ బ్రకటింపఁగనె దానిని లాగిలాగి సాఁగఁదీసి పత్రికాధిపతులునుఁ బత్రికోపవిలేఖకులును గ్రంథకర్తలును వ్రాసెడి వ్యాసములందును, నొసంగెడి యుపన్యాసములందును, రచించెడి గ్రంథములందును నడుమఁ జొప్పించుచు శ్రుతిస్మృతులకంటె

నీకథను నధికప్రమాణము నొడఁగూర్చుస్థితికి వచ్చియున్నారు-కాని యది జరుగఁదగి నదా? జరిగినదా? యని యోజించి వ్రాసియుండ రెవ్వరును గానరారు. ఏపూర్వాచారపరాయణునితలలోన మెదడునకుబదులు బంకమన్నుగాని దున్నపోతుపెంటగాని యుండునో వాఁ డీకథను నమ్మవలయును. ఆకథ యంతవింతగను విరుద్ధముగను నుండు నాయని యడిగెదరా? అట్లేయున్నది. వినిపించెదను. వినుఁడు. పూర్వకాలమున మన పూర్వులు తమసుతలు బుతుమతులైన వెనుక వివాహములు గావించెడివారఁట. తరువాతఁ బరదేశీయులగు మహమ్మదీయులు మనదేశముపై దాడివెడలి మనవారి యెల్లసంపదలను గొల్లగొట్టియుఁ దనివినొందక కామాంధులై తమకోలిపలుకు(కొరాను) తెలిపినరీతి నప్పటి హిందూసుందరులలోనివివాహితలగు మదవతుల తెలుపోక యవివాహితలగు యువతీమణులమాత్రమె బలాత్కారముగాఁ జెఱఁగొనిపోయి రాక్షసవివాహములఁ జేసికొనెడివారఁట. అదికని యనదలగు మనపూర్వులు తురకల బలాత్కారబాధలబారినుండి తమబాలికలఁ దప్పించుకొన వేఱు తెరువు కననేరక యప్పటికిఁదగినటుల యోజించి రజస్వలావివాహములమాని బాల్యవివాహముల గావించి యాముప్పు తప్పించుకొనిరఁట. పిదపఁ దమతోడిమానవసోదరులచరిత వేదశాస్త్రాభిమానులగుటచే వారినీ దమమార్గమునకు మరల్చుకొనఁదలంచి స్మృతులందు యువతీ(రజస్వలా)వివాహము లనుచితములనియు, బాల్యవివాహము లుచితములనియు, వ్రాసి యవిచూపి యందఱిచే మానిపించిరఁట! ఇపుడు చలివెలుఁగువెలుఁగులవలెఁ జలువలువెలిగొలుపు తెల్లతేని వెల్లనిగొడుగు చల్లని చాయను మనపిల్లలా మహమ్మదీయబలాత్కారబాధలుబాసి సుఖముగనుండుటచే నీయెడ నాయనర్థదాయకములగు బాల్యవివాహములతోఁ బనితీరినదఁట! కాన వానిని పుడు మానిపి సుఖబలప్రదములగు తొల్లింటి రజస్వలావివాహముల మరల నెలకొలిపి సంఘమును సంస్కరింపవలెనని యత్నించుచున్నవారఁట! వింటిరా! యీవిచిత్రచరిత్రమును. ఈచరిత్రము నాధారముచేసికొని వ్రాసెడివారు పలువురుగలరు. వారిలో నిరువురివాక్యములమాత్ర మిట నుదాహరించి పిదపఁ గథావిమర్శనమునకుఁ దిగెదము. 28-1-1౯ తేదిని ఆంధ్రదినపత్రికను హిందూపురనివాసులగు శ్రీయుత తౌర్యనారాయణమూర్తిగారు "మతాంతరులు మనదేశమునఁ బ్రవేశించినతరుణమందు నవివాహితకన్యలను జెఱఁబట్టి బలవంతమునఁ బైశాచవివాహములు ప్రారంభమైనపుడు మనవారాపద్ధర్మముగా

బాల్యవివాహము లారంభించి శాస్త్రబద్ధులు గావున స్మృతులలోఁ గొన్ని మార్పులు జేసి కొనియున్నవారు" అని వ్రాయుచున్నారు. ఇందు మనసోదరులు "చెఱఁబట్టి బలవంతమునఁ బైశాచవివాహములు" అనివ్రాసియున్నారు. "చెఱఁబట్టి బలవంతమున" అనుపదములు రాక్షసవివాహమును స్ఫురింపఁజేయుచున్నవి. "పైశాచవివాహములు ప్రారంభములైనపుడు" అని వ్రాసెదరు. దీనివలనఁ బైశాచవివాహములుజరిగినట్లు కనుపడుచున్నవి. ఇందు రెండును (రాక్షసపైశాచములు) జరిగినవా? యొకటిజరిగినదా? రెండును జరిగినవను నెడల మనమూర్తిగారికి ముందువ్రాసినవా రందఱును బలాత్కార (రాక్షస) వివాహములె జరిగినవని వ్రాసియున్నారు. కాని పైశాచవివాహములసంగతి చెప్పలేదు ఒకటియెజరిగిన దను నెడల నాయొకటి బలాత్కారవివాహమా? పైశాచవివాహమా? ఆరెండును గలిసి యొకటియేయందురా? అదితప్పు. బలాత్కారవివాహము రాక్షసవివాహలక్షణము. చూడుఁడు. "ప్రసహ్యహరణాద్రాక్షసః" అని బోధాయనుఁడును, "హత్వా భిత్వా చభిత్వాచ క్రోశంతీం రుదతీం గృహాత్, ప్రసహ్య కన్యాహరణం రాక్షసోవిధిరుచ్యతే" అని మనువును వ్రాసియున్నాఁడు. వీనియర్థమేమనఁగా, మొఱఁబెట్టుచుండెడికన్యను బలాత్కారముగాఁ బట్టుకొని దాని నింటనుండి వెడలించుకొనిపోవుచు దానిబంధువులను, బ్రహరించియుఁ జంపియుఁ జీల్చియుఁ బిదప నెవఁడు వివాహముచేసికొనుచున్నాఁడో యావివాహము రాక్షసవివాహమని చెప్పఁబడుచున్నది. దీనింబట్టి బలాత్కారము రాక్షసవివాహలక్షణమని తెలియవచ్చినది. దీనివలనఁ జెఱఁబట్టి బలవంతమునఁ బైశాచవివాహములు" అనివ్రాయుట శాస్త్రవిరుద్ధము బలవంతము పైశాచవివాహలక్షణముకూడ నగునందురా? అదితప్పు. "సుప్తాం మత్తాం ప్రమత్తాంవోపయచ్ఛేదితిపైశాచః" అనిబోధాయనుఁడును "సుప్తాం మత్తాం ప్రమత్తాంవా రహోయత్రోపగచ్ఛతి. సపాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోధమః" నిదిరించుచున్నదానిని మద్యపానముచే మత్తెక్కినదానిని శీలసంరక్షణలేనిదానిని (కైపుచేవస్త్రాదికముపోయినసంగతితెలియనిదానిని) విజనప్రదేశమందు సంగమముచేయుట నీచమైన పైశాచవివాహమని మనువును జెప్పియున్నాఁడు. దీనివలన బలాత్కారము పైశాచవివాహలక్షణముగాఁ జెప్పఁబడలేదని తెలియవచ్చినది. ఇట్లుండఁగా మన నారాయణమూర్తిగారు శాస్త్రములందు వివాహలక్షణము లెట్లుచెప్పఁబడినవో తెలిసికొనకయే రజస్వలావివాహముల నిషేధించు తమ ప్రతివాదులను నిష్కారణముగా నీచాతినీచములగు దూషణములఁగావించుచు నార్యధర్మములనెల్ల మేమే యెఱుంగుదుమని డంబములు గొట్టుకొనుచు ధర్మోపదేశములను స్వముఖముననేకాక పత్రికాముఖమునఁగూడ బోధింపవచ్చుట మిక్కిలి శోచనీయముగానున్నది.

మానవసేవ సంపుటము 5 సంచిక 2 లో కవిరాజబిరుదాంకితులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు "రజస్వలానంతరవివాహవిషయము", రాజమహేంద్రవరము తహసీల్దారుగారి సర్క్యులర్కు జవాబు," అను పేర మనహిందూదేశమున బ్రాహ్మణులు వైశ్యులు మొదలగుకుటుంబములయందును, బాలికలకు యుక్తవయస్సువచ్చిన వెనకనే వివాహములు (రజస్వలానంతర వివాహములు) చేయుటయాచారమైయున్నట్లు కొన్నిగ్రంథములవలనఁ దెలియవచ్చుచున్నను నిటీవల సుమారు 2000 వేల సంవత్సరములక్రిందట మ్లేచ్ఛపరిపాలనమువచ్చి వారిప్రభుత్వము కొనసాఁగునప్పుడు వారివలనఁ బెండ్లికాని బ్రాహ్మణాదికన్యలకుఁగలుగునట్టి బలాత్కారవివాహములకుఁ దాళఁజాలక "అష్టవర్షాభవేద్గౌరీ నవవర్షాతురోహిణీ, దశవర్షాభవేత్కన్యా అతఊర్ధ్వంరజస్వలా"యని నియమముచేసికొని నాఁటనుండియు రజస్వలానంతరవివాహముల నుల్లంఘించి తమకన్యలకుఁ బదిసంవత్సరములవయస్సువచ్చుటకుఁ బూర్వమే, వివాహమును జేసి మ్లేచ్ఛాదిబాధలనుండి తొలంగుచువచ్చిరి. అదియేయిప్పటికి నీదేశమందు సదాచారమై విరాజిల్లుచున్నది" అని ప్రపాదించియున్నారు. పై మూర్తిగారు మన కన్యలను బలాత్కరించినవారిని మతాంతరులని మూసిపెట్టఁగాఁ గ్రిందిమూర్తిగారు వారిని మ్లేచ్ఛులని బైటఁబడవేసినారు. ఈకవిరాజుగారి వ్రాతఁవలనఁగల్పనాకథయగు మహమ్మదీయబలాత్కారము వేదప్రమాణమునుమించినట్లు గోచరించినదికదా. పరభాషాపండితులేకాక సంస్కృతాంధ్రపండితులమనుకొనువారుకూడ నిట్టికల్పనా కథలను నిశ్చయముగాజరిగినకథలనుగా వ్రాయుటచే నీకథ సత్యమా? యసత్యమా? యిది జరుగఁదగినదా? తగనిదా? యనువిషయములను బాగుగఁ జర్చింప వలసియున్నది. కామాంధులగు మహమ్మదీయయౌవనవంతులు హైందవకన్యలను జెఱఁగొనిపోవునపుడు మున్ను వారికి వివాహమైనదా లేదా యని శాంతముతో విచారించి వివాహమైనకన్యలను విడిచి యవివాహితలను బలాత్కారముగఁ గొనిపోయి వివాహమాడెడివారనికదా మనసోదరులు సెలవిచ్చియున్నారు. వారు పరనారీసోదరులనఁదగియున్న యిప్పటిమహమ్మదీయసోదరులుకారు. అట్టివారైనఁ బరమతకన్యలఁ జెఱఁబట్టుదురా? చెఱఁబట్టరు. అప్పటిమహమ్మదీయులైనను నిప్పటి మహమ్మదీయులైనను మహమ్మదీయులేకాదు హిందువులైనను హిందూమహర్షులైనంగూడ మంచిపడుచుతనములోనున్న కాంతలనుగని కామాయత్తులగుచు రేని వారికి యుక్తాయుక్తవివేక మెన్నటికిని నుండనేరదు. ఇఁక మహమ్మదీయయౌవనవంతులకుఁ బడుచుకన్యలనుగనినపుడుయుక్తాయుక్తవివేక ముండదనిచెప్పుట స్వభావోక్తియేకాని యతిశయోక్తిగానేరదు. మన

పురాణములందు విశ్వామిత్రపరాశరాదిమహర్షులు కాంతలనుగని కామపీడితులై సమయాసమయవిచారమునుగూడ విడిచి దివాసంగమాది శాస్త్రాచారవిరుద్ధకార్యములను గావించినట్లు తెలుపఁబడియుండలేదా? కావుననే కవికులసార్వభౌముఁడగు కాళిదాసమహాకవి మేఘసందేశమహాకావ్యమున సర్గ1 శ్లోకము 6 "ధూమజ్యోతిస్సలిల... .........కామార్తాహి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు" కామార్తులు చేతనాచేతనములవిషయమై స్వభావముచేతనే దీనులుకదా" అని వ్రాసియున్నాఁడు. ఇందును గూర్చి వ్యాఖ్యాతృశిరోమణులగు మల్లినాథసూరిగారు "కామార్తాః చేతనాచేతనేషు విషయే ప్రకృతికృపణాః స్వభావదీనాహి" అనువాక్యముతో మేమిదివరకుఁజెప్పినయర్థమునే చెప్పి యటుపైఁ దమయభిప్రాయము నీక్రిందివిధమున నిచ్చియున్నారు. "కామాంధానాం యుక్తాయుక్తవివేకశూన్యత్వా దచేతనయాచ్ఞా నవిరుధ్యతే" కామాంధులు యుక్తాయుక్తవివేకశూన్యులుకానఁ బ్రాణములేని మేఘమును యక్షుఁడు యాచించుట విరుద్ధముకాదు. మఱియు నిట్లే షేక్స్ఫియరుమహాకవి "Love is blind" యని చెప్పియున్నాఁడు. కామాంధులకిది ప్రాణమున్న జంతువు ఇది ప్రాణములేని వస్తువు అనుజ్ఞానముండదని దీనియర్థము. పెద్దలిట్లుచెప్పుచుండఁగా మన సంఘసంస్కార ప్రియసోదరులు బలాత్కారముగాఁ గన్యలను జెఱఁగొనిపోయి వివాహమాడవలెనని వచ్చిన మహమ్మదీయయౌవనవంతులు తాముబలాత్కరింపఁబోవుచున్న పడుచులు వివాహితలా? కారా? యని విచారింపఁగల్గిరని యెట్లుతలంచిరి? వాదము నిమిత్తము విచారించిరని కొంచెముకాలము తలంచుదము. అట్లువిచారించిరని యేగ్రంథమందుఁ జూపించిరి? అదియొచ్చటను మచ్చునకును గానరాదు. పోనిండు. మహమ్మదీయులు మననారీమణులలో నిదివివాహిత యిదియవివాహిత, యని తెలిసికొనుటకు బాహ్యచిహ్నమేమికలదు? ఆంగ్లేయస్త్రీలలో వివాహితలు తమకురులను ముడివేసికొనుటయు నవివాహితలు కురులు జాఱవిడుచుటయు నాచారముకలదు. అదిమన స్త్రీసంఘమున లేదుకదా. మనలో వివాహితను దెలిసికొనుటకు మంగళసూత్ర మొకటియే యాధారము కనుపడుచున్నది. అవివాహితల కదియుండదు. ఆ మంగళసూత్రమైనను వెలుపలధరింపఁబడునదికాదు. గళమున భూషణములనడుమఁ దాల్పఁబడుచున్నది. అంతియగాక యాచోటు పయ్యెదతోఁ జాలభాగము మూయఁబడియుండును. ఉత్తరదేశపునారీమణులు ముసుఁగుఁగూడ వేసికొనెడియాచారముకలదుకదా. అపుడు మహమ్మదీయులు మనకాంతలలో నిదివివాహిత, యిదియవివాహితయని యెట్లుగుర్తించిరి? గుర్తించిరనుటకు మనసోదరుల కేదియు నాధారముకానరాదు. అపుడు వారు మనకుసమాధాన మిట్లుచెప్పవలయును. అదేమన! అప్పటి కఱకుతురకలు మనయువతులకడకువచ్చి

ముందు ముసుకెత్తివేసి పదపడి పయ్యెదను బడఁద్రోసి యావల నలంకారముల నావలను నీవలకుఁ దొలఁగఁద్రోసిమిసుకు సూత్రముగనవచ్చిన మిడుకుచు నాపడఁతిని విడుతురనియు లేకున్న నాకన్నె మిన్నను గొనిపోయి పరిణయమయ్యెదరనియు సెలవీయవలెను. ఇదిజరుగునా? జరుగునని విశేషులు విశ్వసింపఁదగునా? ఏమి! యీమహమ్మదీయ కామాంధుల వేదధర్మనిష్ఠ! వారు కామముచేఁ గనుఁగానక పోయినను దమ వేదశాస్త్రవిహితధర్మ(వివాహితనువదలిపెట్టుట, అవివాహితను బట్టుకొనుటయను వ)నుష్ఠానమునందు మనసంస్కారసోదరులకంటె నెంతేని భక్తిశ్రద్ధలు కలిగియున్నారని చెప్పకొనవలసివచ్చుచున్నది. ఈమాటలకేమి, ముందుకథను విమర్శించుకొందము మనదేశమున బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్రులను నాలుగుజాతులవారు కలరు. మహమ్మదీయులు నాలుగు జాతులకన్యలను జెఱఁగొనిరా? అందుఁగొన్ని జాతులకన్యలను మాత్రమే చెఱఁగొనిరా? నాలుగుజాతులకన్యలను జెఱఁగొనిరందురా? అటులేని మహమ్మదీయులధాటికి నాలుగుజాతులవారు వెఱచి రజస్వలావివాహములమాని బాల్యవివాహములను బ్రారంభించి తదనుకూలములుగ స్మృతులందు నాలుగుజాతులకన్యలకును బాల్యవివాహము లుచితములనియు రజస్వలావివాహములు నిషిద్ధములనియు మార్పుఁజేసియుండిరని చెప్పవలయునుగదా. చెప్పవలయును. అటులేనిమనశాస్త్రాచారములు వీరివాదముల నిర్మూలమును జేయుచున్నవి. అదెట్లన? పరాశరస్మృతియందు “మాతాచైవ పితాచైవ జ్యేష్ఠభ్రాతా తథైవచ, త్రయస్తేనరకంయాంతి దృష్ట్వాకన్యాం రజస్వలాం” యస్తాంసముద్వహేత్కన్యాం బ్రాహ్మణోమదమోహితః, అసంభాష్యోహ్యపాంక్తేయః సవిప్రో వృషలీపతిః అని వ్రాయఁబడియున్నది. దీనింబట్టి రజస్వలయైయున్నకన్యను బ్రాహ్మణుఁడుమాత్రమే చేసికొనఁగూడదనియు మదమోహితుఁడైయెవఁడైనఁ జేసికొనినయెడల వాఁడసంభాష్యుఁడును, నపాంక్తేయుఁడునునగుననియు దెలిపియున్నాఁడుకాని నాలుగుజాతులలోను రజస్వలలైయున్నకన్యలను వివాహమాడిన నాలుగుజాతులపురుషులు నపాంక్తేయులు నసంభాష్యులు నగుదురని వ్రాసియుండలేదు. దీనితో మనసోదరులవాదము సగమునశించినది. మనుస్మృతి, అధ్యాయము 3 శ్లోకము 26 “గాంధర్వో రాక్షసశ్చైవ ధర్మ్యౌ క్షత్రస్య తౌస్మృతౌ” యనియు వేదవ్యాసస్మృతి, అధ్యాయము 4 శ్లోకము 4 “గాంధర్వో రాక్షసశ్చైవ క్షత్రియస్యతు శస్యతే” అనియు బోధాయనస్మృతి, అధ్యాయము 11, సూత్రము 13 “అత్రాపి షట్సప్తమే క్షత్రధర్మానుగతౌ” అనియుఁ జెప్పియున్నవి. వీనింబట్టి క్షత్రియులకు గాంధర్వరాక్షస (రజస్వలయైనతరువాతకాఁదగిన) వివాహములు ప్రశస్తములని తెలి

యువచ్చినది ఇప్పటికిని వారియందు రజస్వలావివాహాచారము కలదనియు బ్రాహ్మణు లలోమాత్రమే లేదనియు మనసంస్కారసోదరులే యంగీకరించియున్నారు. దీనింబట్టి మహమ్మదీయుల బలాత్కారమునకు భయపడి మనపూర్వులు నాలుగుజాతులకన్యలకు రజస్వలావివాహములమాని బాల్యవివాహములుచేయుట ప్రారంభించి ధర్మశాస్త్రముల లో నాలుగుజాతులకన్యలకు రజస్వలావివాహములు నిషిద్ధములనియు బాల్యవివాహము లుచితములనియు వ్రాసిరనువాదము పూర్ణముగ నిర్మూలమైనది.

ఇంతవఱకు మీరుచెప్పినదానింబట్టి బ్రాహ్మణక్షత్రియులు వివాహముచేసికొన వలసినవిధాన ము తెలియవచ్చినది. కాని వైశ్యశూద్రు లెట్లువివాహమును గావించుకొనవ లసినదియుఁ దెలియలేదని కొందఱడుగవచ్చును. సమాధానమువినుఁడు, ఇపుడు బ్రా హ్మణవైశ్యులు దశరథపుత్రులలో రామలక్ష్మణులవలె నొకటిగానుండి బాల్యవివాహ ములను క్షత్రియశూద్రులు భరతశత్రుఘ్నులవలె నొకటిగానుండి గౌణముగా రజస్వ లావివాహములను గావించుకొనుచున్నారని యెఱుంగుదుఱుగాత.—

ఇంతవఱకు విన్నవించినదానివలన హిందువులందఱు మహమ్మదీయులదాడికి వె ఱచి బాల్యవివాహములఁదెచ్చి పెట్టుకొనిరన్నమాట తప్పని ధ్రువపడినది. ఇఁక మనసో దరులు, మహమ్మదీయులు బ్రాహ్మణవైశ్యకన్యలనే చెఱఁగొనిపోవుటచేత వారిబిడ్డలకు మాత్రమే బాల్యవివాహములనాచరించి శాస్త్రములందును నవి యుచితములనివ్రాసికొని బ్రాహ్మణులకు రజస్వలావివాహములు నిషిద్ధములని లిఖించినట్లు చెప్పవలెను. ఇదియు నిరాధారముగానే యున్నది. ఏలఁయన,—కామాంధులై స్త్రీలను బలాత్కరించుచున్న మహమ్మదీయులు వీరు బ్రాహ్మణవైశ్యకన్యలు, వీరుక్షత్రియశూద్రకన్యలు నని యెట్లు నిర్ణయింపఁగలిగిరి? ఒకవేళ నిర్ణయింపఁగలిగిరని తలంతము. క్షత్రియశూద్రకన్యలనువి డిచి బ్రాహ్మణవైశ్యకన్యలనుమాత్రమే బలాత్కారముఁజేయుటకుఁ గారణమేమి? క్ష త్రియశూద్రకన్యలు సౌందర్యవిహీనలును, బ్రాహ్మణవైశ్యకన్యలు సౌందర్యవతులును గుటచే క్షత్రియశూద్రకన్యలనువదలి బ్రాహ్మణవైశ్యకన్యలను బలాత్కరించిరని చెప్ప వలెనా? ఇదియు విరుద్ధమె. ఏమన? పూర్వమున సీత, దమయంతి, ద్రౌపది మున్నగు నారీమణులును మహమ్మదీయపరిపాలనకాలమునఁ బద్మిని, విమల, మొదలగు సతీతిలక ములును ననన్యసామాన్యలావణ్యవతులై క్షత్రియకులమున జననమొందిరనుకథలు కన వచ్చుచున్నవి. కాన క్షత్రియశూద్రులందును గొందఱు సౌందర్యవతులుండవచ్చును. బ్రాహ్మణవైశ్యకన్యలలోమాత్రమే యందఱు సౌందర్యవతులైయున్నారా? లేరు. కాఁబట్టి సౌందర్యవతులు కాని కారణమున క్షత్రియశూద్రకన్యలను వదిలి సౌందర్యవతులను హ

తువుచే బ్రాహ్మణవైశ్య కన్యలను బలాత్కరించిరనుమాట నిరస్తమగుచున్నది. వాదము కొఱకు బ్రాహ్మణవైశ్యకన్యలు చక్కనివారగుటవలన మహమ్మదీయులు బలాత్కరించి రనితలంతము. ఇదియు నిలుచునట్లు కనుపడదు. అదేమన — దేశసంరక్షణ గావించుచున్న క్షత్రియ శూద్రసోదరులు తమపరిపాలితులలోని బ్రాహ్మణవైశ్యకన్యలను దురకలు బలాత్కారముగాఁ గొనిపోవుచుండఁగా నేలనివారింపలేదు? నివారించినయెడ బాల్యవివాహాచారము మహమ్మదీయబలాత్కారమువలనఁ గలిగినదనుట తప్పగును. నివారింపలేదనెదరా? దానికిఁ గారణమేమి? క్షత్రియులు వారినెదిరింపలేకపోయిరని చెప్పెదరా? ఎదిరింపలేనపుడు వారిలో సౌందర్యవతులగుకన్యల నేల చెఱఁగొనిపోయియుండలేదు? అపు డిట్లుసమాధానముఁ జెప్పవలెను. అదేమనఁగా క్షత్రియశూద్రులు తమకన్యలను బలాత్కరింపకుండునెడల బ్రాహ్మణవైశ్యకన్యలను; (కప్పతన్ను నెత్తుకొనితిరిగినయెడ మిగిలినకప్పలను దిననిచ్చెదనని పాముతో సంధిఁజేసికొనినట్లు) బలాత్కరింపనిచ్చెదమని సంధిఁజేసికొనిరా? ఇట్లని యేచరిత్రలందైనఁ గలదా? ఇది యంతమాత్రమును విశ్వసింపఁ దగినదికాదు. మన క్షత్రియశూద్రసోదరులు తమకంఠనాళములఁ బ్రాణవాయువు సంచారముఁజేయుచుండఁగా స్వార్థపరులై యింతటినీచసంధికి దిగుదురని వివేకులు తలంతురా? తలంపరు. పోనిండు, వాదమునిమిత్తము మన క్షత్రియసోదరు లిట్టి నీచసంధికి నంగీకరించిరని యెంచుదము. ఇదియు నిలువనేరదు. ఏలయన, రాజపుత్రస్థానచరిత్రలు మనము చదివిచూచినచో నం దెన్నిపర్యాయములో క్షత్రియాంగన లెందఱు మహమ్మదీయబలాత్కారములకు వెఱచి జోహారు (అగ్నిగుండప్రవేశము) లు కావించినట్లు వర్ణింపఁబడియున్నదో చూడుఁడు. సామాన్యక్షత్రియాంగనలమాట కొంచెముకాలముంచుఁడు, శ్రీ భీమసింగుమహారాజాగారి సతీతిలకము మూర్తీభూత హైందవజనపంచాప్రాణను నసామాన్యలావణ్యవతిని సంతానవతిని, పతివ్రతాశిరోమణిని పద్మినీదేవిని దనకు దేవేరినిగా నొసంగిన రణమునుమాని పోదునని యల్లాయుద్దీను మహమ్మదీయచక్రవర్తిగారే సంధినడిపినట్లు సంస్కారిశిరోభూషణులగు శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు హేమలతయను గ్రంథమునందు 68వ పుటలో నీక్రిందిరీతిఁ దెల్పియున్నవారు “భీమసింగుమహారాజుభార్యయగు శ్రీపద్మినినిజచక్రవర్తికిసమర్పించినపక్షమున నాతఁడు చిత్తూరుముట్టడిమాని స్వదేశమునకరుగుటకు సమ్మతించునని చక్రవర్తి రహిమానుఖానుచే సందేశముపంపుటచే నభిమానధనులగు రాజపుత్రులు కోపాగ్ని ప్రజ్వరిల్లి శాత్రవారణ్యమును దహింపఁ గృతప్రతిజ్ఞులైరి.” చరిత్ర లిట్లు దెలుపుచుండఁగా మనసోదరులు క్షత్రియాదులు సంధిఁజేసికొని తమజాతికన్యలను మహమ్మదీయులబారిఁబడకుండఁ గాఁపా

దుకొని బ్రాహ్మణాదికన్యలవిషయమై యుపేక్షించిరనుట దూష్యముగుచున్నది. దీనిం బట్టి బాల్యవివాహములు మహమ్మదీయబలాత్కారజన్యములని ఘన మూర్తిద్వయము వ్రాసినవ్రాంత యాపాత రమణీయముగానున్నదని ప్రాజ్ఞులు గ్రహింపక పోరు. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు కల్పనాకథ నాధారముచేసికొని బాల్యవివాహములు మధ్యకాలాగతములని తెలిపినను వారిగ్రంథమున రజస్వలావివాహములుమాత్రము కూడ నని తెలుపుటయేకాక శాస్త్రాధారములతో రజస్వలావివాహములనుగావించుకొనెడి క్షత్రియశూద్రులనుగూడ "రజస్వలా త్పూర్వవివాహము లె చేసికొనునట్లు శాసించవల యునని కోరుచున్నాడను" అని పరిభుత్వము వారికి విన్నవించినందులకు క్షత్రియశూ ద్రసోదరులు శ్రీశాస్త్రిగారిని భూషింతురో దూషింతురో చెప్పఁజాలముకాని మేము మాత్రము శ్రీవారికిఁ గృతజ్ఞులమైయున్నాము. ఒక్క చిన్నవిషయముకలదు. శ్రీకృష్ణ మూర్తిశాస్త్రిగారుభయభాషాపండితులును కవిరాజబిరుదాంకితులు నైయుండి"క్షత్రి యులు శూద్రులు మొదలగుకన్యకలనుగూడ నతిబాల్యవివాహములుచేయుట తగదు" అను నొక యద్భుతవాక్యమునుఁ బ్రసాదించియున్నవారు.ఇంతవరకు మేమేకాక లోకు లందఱును బ్రాహ్మణ వైశ్యసంఘములందువలెనే క్షత్రియశూద్రసంఘములందును గొం దఱుపురుషులును, గొందఱుస్త్రీలును గలరనితలంచుచున్నారు. ఇట్లుండఁగా క్షత్రి యులు, శూద్రులు, మొదలగుకన్యలు" అనివ్రాయుటచే క్షత్రియశూద్రసంఘములలోఁ బురుషులులేక యందఱు స్త్రీలుగానె యున్నారని తేల్చివ్రాసియున్నట్లు తెలియవ చ్చినది. ఇట్లువ్రాయఁదగునా? పాపము! క్షత్రియశూద్ర సంఘములలోని పురుషులు వీరికేమియపకార మొనర్చిరి? దీనితో మాకేమి? ఇంతటితోఁ జరిత్రవాదము ముగిసినది స్వయంవరవివాహములవలన వ్యభిచారము వృద్ధియగును. దానినుండి స్త్రీలనురక్షించుట కష్టము.

## స్త్రీసంరక్షణము.

ఏదేశమందైనను నేసంఘమందైనను బురుషమాత్రునికెల్ల స్త్రీరక్షణ మత్యావశ్యక మైనకార్యము. వారు పవిత్రలుగనున్న గృహము కులము పవిత్రములుగనుండును. వా రపవిత్రలైన గృహమును గులమును నపవిత్రమగుచున్నవి. మనుస్మృతి, అధ్యాయ ము 9 శ్లోకము 5 "సూక్ష్మేభ్యోపి ప్రసంగేభ్యః, స్త్రియో రక్ష్యా విశేషతః, ద్వయోర్హి కులయోశ్శోక మావహేయు రరక్షితాః" దుష్టాచారసంపాదక ములయిన దుష్టులసాంగత్యములు స్వల్పములైనను వానినుండి స్త్రీలు మిక్కిలి రక్షింపఁ దగినవారు. అట్లు రక్షింపఁబడరేని పుట్టినయింటికిని మెట్టినయింటికిని దుఃఖమునుగలిగి

చుచున్నారు,, అని తెలుపుచున్నది. దీనింబట్టి యెవఁడు తనకులము దుఃఖరహితముగా నుండఁగోరునో వాఁడు స్త్రీని రక్షించుకొనవలయునని తేలినది, ఇంతియకాదు ఈ స్త్రీ రక్షణమువలన నింక ననేకఫలములుకలవు. వానింగూర్చి శ్లోకము 7 ,,స్వాం ప్రసూతిం చరిత్రంచ కుల మాత్మానమేవచ, స్వంచధర్మం ప్రయత్నేన జాయాంరక్షన్హి రక్షతి,, భార్యను గాఁపాడువాఁడు తనసంతతిని, శిష్టాచారమును, గులమును, దనను, దన వైదికధర్మమును వీని శ్రద్ధతోఁ గాపాడినవాఁడగుచున్నాఁడు,, అని చెప్పుచున్నది. దీనింబట్టి స్త్రీరక్షణమువలన సత్సంతానమును, సదాచారమును, గులమును ధర్మమును బురుషుఁడు కాపాడుచున్నవాఁడని తెలియవచ్చుచున్నది. రజస్వలలగువఱకు వివాహముచేయక కన్యలకు స్వయంవరవివాహాధికారము నిచ్చినయెడల వెనుకఁదెలిపిన ధర్మములన్నియు నశించుననుటకు సంశయముకలదా? లేదు. అదేమన? స్వయంవరముఁజేసికొనఁబోవుకన్య స్వజాతిపురుషునే వరించుననువిశ్వాసము లేదుకావునను స్వయంవరవివాహముఁజేసికొనఁబోవు పురుషుఁడైనను స్వజాతికన్యనే వరించునను నమ్మకము లేదు కావునను స్వయంవరవివాహము లరిష్టదాయకములని తేలినది. 9 శ్లోకము ,,యాదృశం భజతేహి స్త్రీ సుతంసూతే తథావిధం, తస్మాత్ప్రజావిశుద్ధ్యర్థం స్త్రియంరక్షేత్ప్రయత్నతః,, స్త్రీ యెటువంటిపురుషుని గూడుచున్నారో వానివంటిపుత్త్రునిఁ గనుచున్నారు. కావున బరిశుద్ధుఁడైన పుత్త్రుఁడుపుట్టుటకై శ్రద్ధతో భార్యను వ్యభిచారదోషమును జెందనీక కాపాడవలయును,, అని చెప్పుచున్నది. ఇప్పటి లోకానుభవముం బట్టిచూడఁగను సోదరులుకోరుచున్న స్వయంవరవివాహములవలన స్త్రీలువివాహమునకు ముందే వ్యభిచారిణులుకాకయుండుటకు నవకాశములేదని తేలుచున్నది. ఈవిషయ మిదివరకనుభవవాదములో నిరూపింపఁబడియున్నది. 14 శ్లోకము ,,నైతా రూపం పరీక్షంతే నాసాం వయసిసంస్థితిః, సురూపంవా విరూపంవా పుమానిత్యేవభుంజతే,, స్త్రీలు పురుషుల చక్కదనముగాని వయస్సునుగాని విచారింపక వారెట్టివారైనను పురుషులైనంతమాత్రముననే వారినిఁ బొందుదురు.'' అని చెప్పుచున్నది. కానవారిరక్షణ యవసరము. ఇంతవఱకుఁ గ్రియావ్యభిచారమునుండి స్త్రీలను గాపాడవలసిన విధము తెలుపఁబడియున్నది. ఇఁకమీఁద స్త్రీమానసవ్యభిచారమువలనఁగలుగు ననర్థముం గూర్చి ముచ్చటించుచున్నారము. పురుషుని మానసికవ్యభిచారమువలన నాతని కొక్కింత శుక్లనష్టముకలుగును గాని దానఁ గుటుంబమునకు హానికలుగనేరదు. ఇఁక స్త్రీల మానసవ్యభిచార మటువంటిదికాదు. అది యామెవలనఁగలుగఁబోవు సంతానము నంతను మూడుతరములదాక నపవిత్రతగలదానినిగాఁ జేయును. ఈవిషయమునుగూర్చి

మన వేదశాస్త్రములు మిక్కిలి బోధించుచున్నవి. "తథాచ శ్రుతయో బహ్వ్యోనిగీతా నిగమేష్వపి, స్వాలక్షణ్యపరీక్షార్థం తాసాం శృణుత నిష్కృతీః" అని 9-అ 19శ్లోకము చెప్పుచున్నది. అనఁగా స్త్రీలు మిక్కిలిగా వ్యభిచార దోషముగలవారని యనేక శ్రుతులందును శాస్త్రములందును జెప్పఁబడియున్నది. అందుకు దృష్టాంతముగా నావ్యభిచారమునకు శ్రుతియందుఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తమును వినుఁడు. ఆశ్రుతి యేదనిన? సనూ త్రైకాగ్నికాండమంత్రభాష్యే ద్వితీయప్రపాఠకే యేకోనవింశః ఖండః" "యన్మే మాతా ప్రలులోభ చరత్యననువ్రతా తన్మే రేతః పితా వృఙ్క్తాం మాఽభురన్యోవపద్యత, అముష్మై స్వాహా" ఇందులకు హరదత్తాచార్యులవారు భాష్య మిట్లు చేసియున్నారు. "యద్రేతః అన్యదీయం మే మమ మాతా భర్తుః అననువ్రతా అననుకూలా చరతీ చరన్తీ ప్రలులోభ ప్రకర్షేణ యేష(సాధ్వీనామపి మానసవ్యభిచారసంభవా దేవముచ్యతే) తద్రేతః మే మమ పితా వృఙ్క్తాం ఆచ్ఛిద్య స్వీకరోతు మానసవ్యభిచారనిమిత్తం రేతసి సాంకర్యం మాభూత్,, ఆభవతీత్యాభుః ఏతావతానిమిత్తేన మాం ప్రతి పితృత్వేనాభవన్ అన్యః అవపద్యతాం మోఘాశోభవతు, యస్మయా దీయమానం హవిః తన్నలభతాం అముష్మై యజ్ఞశర్మణే మత్పిత్రే స్వాహా" నాతల్లి భర్తకు ననుకూలవతియై చరించుచు నితరుని యే రేతస్సును మిక్కిలి యభిలషించినదో(పతివ్రతలకుఁగూడ మానసవ్యభిచారము సంభవించుటవలన నిట్లు చెప్పఁబడినది) యా రేతస్సును నాతండ్రి గ్రహించుఁగాక. మానసవ్యభిచారనిమిత్తమైన రేతస్సాంకర్యము లేకపోవుఁగాక. ఈమానసవ్యభిచారనిమిత్తముచేత ననుఁగూర్చి తండ్రిగానైయున్న యితరుఁడు నాచేనీయఁబడు హవిస్సు పొందక వ్యర్థమైనకోరికగలవాఁడగుఁగాక. నేనిచ్చు హవిస్సు నాతండ్రికిఁ జెందుఁగాక "యని పై మంత్రభావము. ఇట్లే" యన్మే పితామహీ ప్రలులోభ, యన్మే ప్రపితామహీ ప్రలులోభ" యను మంత్రములు పితామహ (తండ్రితల్లి) యొక్కయు, ప్రపితామహి (తాతతల్లి) యొక్కయు మానసవ్యభిచారములను గుఱించి ప్రాయశ్చిత్తవిధానములను జెప్పియున్నవి. ఈయర్థముకే మనుస్మృతి అధ్యాయము 9 శ్లోకము 20 "యన్మే మాతా ప్రలులుభే విచరంత్యపతివ్రతా, తన్మే రేతః పితా వృఙ్క్తా మిత్యస్యైతన్నిదర్శనం" అను దానియందు వ్రాయఁబడియున్నది. అనఁగా నొకఁడు తనతల్లికి మానసవ్యభిచారము సంభవించినటులఁ దెలిసికొని దానికిఁ బ్రాయశ్చిత్తముఁ జేసికొనుచున్నాఁడు. నాతల్లి పాతివ్రత్యము లేక యన్యునియింటికి వెళ్లి యచ్చటఁ బరపురుషునిం జూచి యేదైనను మనస్సుచేత నపేక్షించియుండినట్లైన నాయాశచేత స్ఖలనమైన రేతస్సును నాతండ్రి తనరేతస్సుచేఁ బరిశుద్ధముఁ జేయుగాక. అని యర్థము. ఈప్రాయశ్చిత్తమా మానసవ్యభిచారమొనర్చినట్టి తల్లిగర్భమునఁ దాను పుట్టినందులకై పుత్రుఁడు చేసికొనవలసినదే కాని యామెకొఱకు గాదు.

ఈవిన్నవించినదానింబట్టి స్త్రీల మానసవ్యభిచారమువలన వారియందుఁ గలిగెడి సంతానమునకు నపవిత్రతకలుగునని ధ్రువపడినది. ఈమానసవ్యభిచారమునుండి స్త్రీలను రక్షింపవలసినదినములు రజోవతులైయున్న మూడుదినములని తెలియవలయును

నాల్గవదినమున స్నానముచేసి భర్తృసందర్శనము గావించినపిదప నితరపురుషులఁ జూచుట వలనవచ్చెడి మానసవ్యభిచారమువలన సంతానమున కేవిధమైన యపవిత్రత కలుగ నేరదని యుఁ దెలియవలెను. దీనింగూర్చి రెండు చిన్నకథలు గలవు. వానిని "సుశ్రుతము రజస్వలావివాహములను బోధించుచున్నదా?" యను విషయవిమర్శయందు వ్రాసి యున్నారము. అటఁ జదువుకొందురుగాక. ఈవిమర్శమువలన స్త్రీలను మానసవ్యభి చారమునుండియే రక్షింపవలెనని వేదశాస్త్రములు ఘోషించుచున్నవనియు రక్షించని యెడ సంతాన మపవిత్రము గానగునియుఁ దేటపడినది. ఇట్లుండఁగాఁ గ్రియావ్యభిచారము న కవకాశ మొసంగెడి రజోదర్శనానంతరస్వయంవరవివాహములవలన నెంతయపవిత్ర సంతానముకలుగునో ప్రాజ్ఞు లూహింతురుగాక.

---

## ఉపసంహారము.

ఓ పూర్వాచారపరాయణులారా!

మనసంఘసంస్కారసోదరులలోఁ గొందఱు తమ దేశీయులకు రాజ్యాంగస్వాతంత్ర్యములఁ గొన్నిటి నార్జింపఁగోరి మనదేశమునకేతెంచిన రాజకార్యధురంధరులగు పాశ్చాత్యపండితులసన్నిధినిఁ దమకోరికల నివేదింప వారు మనమేలుఁగోరి మనసోదరుల తో "మీలో ననేకజాతిమతశాఖలు కలవు. అవి ద్వేషప్రధానములై యున్నవి. వానింగని యున్న ప్రభుత్వమువారు మీకిప్పుడే రాజ్యాంగస్వాతంత్ర్యముల నొసంగుటకు సమ్మ తింపరు. సమ్మతించినను మీలో మీరు కలహించుకొని నశించుటకు మూలమగును గాన సంఘక్షేమమును గోరెడి మీరు ముందు మీలో నేకజాతీయత నెలకొల్పుకొనుట ప్రథ మకర్తవ్యమని బోధింప నేకజాతీయత నెలకొల్పినంగాని రాజ్యాంగస్వాతంత్ర్యములు లభింపవని నమ్మి యందులకై మొదల సర్వవర్ణసమావేశపు విందుల నారగించి యందువ లన ఫలము గానక తదుపరి యంతశ్శాఖావివాహముల స్థాపింపఁబోయి విఫలమనోరథు లై పిదపఁ బత్రికాగ్రంథముఖముల మనలఁ బరిపరివిధముల దూషింప మొదలిడి యందు నను ఫలితము గానక యటుపైఁ జాల గోరాజించి యెన్ని వర్ణసాంకర్యములనైనను గావిం చుటకుఁ బురుషులకంటె స్త్రీలు పర్వశక్తులు కలవారని తలంచి వారు మనసంఘమునన స్వతంత్రులై యుండుటచే వారికి స్వాతంత్ర్యము లభించినంగాని వర్ణసాంకర్యముఁ జేయ లేరని యెంచి స్త్రీలకా స్వాతంత్ర్యము ర(జోదర్శనా)నంతరస్వయంవర వివాహములవలన గాని చేకూరదని తలపోసి స్వయంవరవివాహములు జనసామాన్య మంగీకరించినంగాని సాగవనియనుకొని సామాన్యజనులు శ్రుతి స్మృతి సూత్ర పురాణేతిహాస జ్యోతిశ్శాస్త్ర సుశ్రుతాది మతగ్రంథములం దధికనిష్ఠకలవారగుటచే నాగ్రంథములన్నియు (రజోదర్శ నా) నంతర స్వయంవరవివాహములనె బోధించుచున్నవని యుక్త్యాభాసముల నాధార ముఁ జేసికొని యపార్థములతోడను, విరుద్ధాన్వయములతోడను, గూడినప్రమాణములఁ జేర్చి వ్యాసములువ్రాసి గ్రంథములురచించి యున్నారు. ఈవిషయ మీగ్రంథమందు విపులముగాఁ జర్చించి వారివాదములను ఖండించియున్నవారము. మేమేకాక మాకుఁ బూర్వ మనేకపండితులు సర్వప్రమాణవాదములతో వీరివాదమును ఖండించుటచేఁ దమ ప్రయత్నము సాగదనియోజించి దండోపాయమునంగాని పూర్వాచారపరాయణులను జక్కఁజేయవలను గాదనియెంచి యిప్పుడు "రజస్వలావివాహశాసనమును" గోరియున్నారు వారికోరిక నెరవేరనేని మనసంఘము నిర్మూలమగునని యిందు శాసన యుక్తానుభవ

హేతువాదవిమర్శనములందు నిరూపించియున్నవారము. కాన వీనిం దిలకించి పూర్వా చారపరాయణులందఱును నొండొరుల నుద్బోధించుకొని యీమహాపదను బాపుకొందురని నమ్మియున్నవారము ఇంతయేల? మన మార్యమహర్షుల సంతతివారమై వారిరక్తము మనశరీరరక్తనాళముల నేమాత్రమేనిఁ బ్రవహించుచున్నయెడలను వారికీర్తి దిగంతవిశ్రాంతమై మనను రక్షణీయులమైనదగు నెడలను త్రికరణశుద్ధిగా మనభావికాలసంఘసంరక్షణమును మనలక్ష్యమునందుఁ బెట్టుకొనియున్న యెడలను, మనసంఘసంస్కారసోదరు లిపుడుచేసెడి శ్రుతి స్మృతి సూత్ర పురాణేతిహాస జ్యోతిశ్శాస్త్ర సుశ్రితయుక్త్యనుభవ హేతు చరిత్రాదులకు విరుద్ధములైన యుపదేశములను, బొందియాయాచారములను గ్రహింపక యుండుముగాత పరమేశ్వరుఁ డీ సనాతనధర్మాభిమానమును మనయందాచంద్రతారార్కముగా నిలుపుఁగాత సకలజనులును విశ్వజనీనమగుసుఖము ననుభవింతురుగాత! ధర్మమే పక్షముననున్న నాపక్షము జయించుఁగాత సత్యమేజయించుఁగాక. అసత్యము జయింపకుండుఁగాక ఓ సంఘసంస్కారప్రియసోదరులారా!

మీవాదములన్నియు నిందు బూర్ణముగా ఖండింపఁబడినవి. మీరు మమ్ము నతిపరుషవాక్యములతో దూషించియుండుటచే మీవాదములు పడిపోయినపు డావిషయమును జనసామాన్యము గ్రహింపవలెనని యెంచి యాయాస్థలములయందుఁ గొన్ని పరిహాసోక్తులను సామాన్యపరుషవాక్యములను విధిలేక ప్రయోగించియున్న వారము. వానింగూర్చి మీ రెట్లు తలంచినను మేముచేయునదేమియు లేదు. మేము విమర్శించిచూడఁగా మీబోధలను వినినయెడల నే మీరుచెప్పినట్లు నీతిలేనిశుంఠలమును, ద్విపాదపశువులమును, నగుదుమని బాగుగఁ దోఁచుటచే వర్ణసాంకర్యకారక ర(జోదర్శనా) నంతరస్వయంవరవివాహాది సంస్కారములను మాసంఘపురపరిసరమునకుఁగూడఁ జేరనీయమని యీగ్రంథముఖమున విన్నవించుచు నీగ్రంథసమాప్తినిఁ గావించుచున్నారము.

సనాతనధర్మో విజయతే తరాం

క॥ ధర్మంబుఁ జెఱుపఁ జెఱుచును
ధర్మము రక్షించువానిఁ దా రక్షించున్
ధర్మంబు చెడక యుండను
నిర్మలమతిఁ బ్రోవవలయు నిశ్చలనియతిన్॥

(భారతము)

ఇది శివపురపు వీరభద్రపాకయాజి,
చివుకులఅప్పయ్యశాస్త్రిప్రణీత
రజస్వలావివాహఖండనము.

శ్రీ శ్రీ శ్రీ

# * తప్పొప్పుల పట్టిక. *

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 1 | జెలుచు | జెలుచును |
| 12 | 18 | పండిత | పండితు |
| 21 | 22 | పహాత్రుఁడు | పహోత్రుఁడు |
| 22 | 19 | నటు | నట్లు |
|  | 21 | అప్పుడి | అప్పుడీ |
| 23 | 5 | వాకాన | వారుకాన |
|  | 6 | పృష | పృష్ఠ |
| 24 | 26 | త్రిలు | త్రీలు |
|  | 28 | తెలుచున్నది | తేలుచున్నది |
| 25 | 11 | సంపర్భలగు | సందర్భములగు |
|  | 13 | ఊర్ధ్వతు | ఊర్ధ్వంతు |
|  | 18 | శోకము | శ్లోకము |
|  |  | ఉత్కృష్టాభి | ఉత్కృష్టాయాభి |
|  | 28 | నచైవాణాం | నచైవేనాం |
| 26 | 28 | వరి | వరిం |
| 27 | 1 | వార్షికం | వార్షికీం |
|  | 12 | బ్రాహ్మణ | బ్రాహ్మ |
| 29 | 3 | తిషం | తిష్ఠం |
|  | 17 | సంశయం | సంశయః |
| 30 | 1 | వర్ణాన్యా<br>శ్లోక | వర్ణాన్యు<br>శ్లోక |
|  | 10 | హాత్య | హాత్య |
|  | 11 | వార్షికం | వార్షికీం |
|  | 26 | తద్ధాతుః | తద్దాతుః |
|  | 27 | రోహిణి | రోహిణీ |
|  | 28 | జేసిన | చేసిన |
| 31 | 2 | మగువటలన | మగుటవలన |
|  | 4 | తదద్బ్రహ్మ | దదద్బ్రహ్మ. |

| | | | |
|---|---|---|---|
| | 15 | శ్లొకము | శ్లోకము |
| | 18 | సముద్వాహె | సముద్వాహే |
| | | పాంక్తేయ | పాంక్తేయ |
| | 21 | చెసి | చేసి |
| | 29 | ఉద్వాహొద్యసుతాం | ఉద్వాహోద్యస్సుతాం |
| 32 | 15 | శాతాతళ | శాతాతప |
| | 14 | శ్లొకము | శ్లోకము |
| | | శసంస్కృతా | సంస్కృతా |
| 33 | 4 | బ్రహ్మే | బ్రాహ్మే |
| 35 | 9 | కానున్నను | గానున్నను |
| | 10 | మైదునాంగ | మైధునాంగ |
| | 18 | సకామకులై | సకాములై |
| | 21 | జేసికొని | చేసికొని |
| 36 | 12 | దచ్ఛయ్యాకు | దచ్ఛయ్యాకు |
| | 18 | మొహాం | మోహాం |
| | 28 | జేసుకొని | చేసికొని |
| 38 | 28 | గర్భాదాన | గర్భాధాన |
| 39 | 24 | యదేయం | యదీయం |
| 40 | 14 | త్కారగాత్ | త్కారణాత్ |
| 43 | 32 | జేయ | జ్ఞేయ |
| 48 | 26 | నిపు | నిప్డు |
| | 28 | వలద | వలదని |
| 53 | 11 | పత్ని | పత్నీ |
| 55 | 8 | యిలాలు | యిల్లాలు |
| 60 | 7 | మార్చుట | మార్చుట |
| | 16 | మారి | మాతి |
| | 17 | డికాల | డీకాల |
| 61 | 17 | బొంద | బొందు |
| | 26 | అష్టవరా | అష్టవర్షా |
| 63 | 24 | బాల్యవివాహములును పుటికొన్ని జాతులయందు బాల్యవివాహములు నురజోదర్శ | రజోదర్శ |

| | | | |
|---|---|---|---|
| | 29 | వ్యవహారకములుగును | వ్యవహారముకలుగును |
| 64 | 5 | భోగా | భోగే |
| | 6 | గృహీతాం | గృహీతాం |
| | 8 | బు | బుద్ధి |
| | 10 | అన్యపూర్వికా | అన్యపూర్వక |
| 69 | 1 | స్త్రీల | స్త్రీల |
| 78 | 26 | నిహితము | విహితము |
| | 28 | పమాణం | ప్రమాణం |
| 79 | 11 | త్సల్ప | త్యల్ప |
| 80 | 5 | దరశ్రీయములని | దర్మశ్రీయములని |
| 82 | 16 | స్థాపింపఁలఁచి | స్థాపింపఁదలఁచి |
| 93 | 9 | హిందు | హిందూ |
| | | గీర్తిని | కీర్తిని |
| 98 | 10 | యను | మను |
| | 13 | క్రూర్యత్వముజ్ఞా | క్రూరత్వముజ్ఞా |
| | | స్త్రీలకివిధ | స్త్రీలకేవిధ |
| | 14 | స్వాతంత్రిము | స్వాతంత్ర్యము |
| | 28 | స్వాతంత్ర | స్వాతంత్ర్య |
| 99 | 19 | చెప్పకొనక | యొప్పకొనక |
| 101 | 13 | స్వత్వాధికారము | స్వత్వాధికారము |
| 102 | 9 | దేశమా | దేశమాత |
| 104 | 4 | బాలురుదము | బాలురుదయిం |
| | | యింటు | చుటు |
| | 7 | గర్భదాన | గర్భాధాన |
| | 10 | (జోదర్శనా) | ర(జోదర్శనా) |
| 111 | 11 | అత్యుత్న | అత్యున్నత |
| 116 | 11 | గృహాస్తుఁడై | గృహస్థుఁడై |
| | 9 | యింటయొ | యింటరో |
| 120 | 7 | దేశములై | దేశముపై |
| | 14 | లచంత | లచలిత |
| | 26 | పైసాచ | పైశాచ |
| 121 | 12 | భిత్వా | ఛిత్వా |

# పీఠిక

రజస్వలావివాహశాసనము గడబిడ యారంభమై దాన బహుజనులు పలువురమంది బిల్లు, ఏరీతి, ప్యాసుకాకుండునాయని యోజించి తమయనంగీకారపత్రికలఁ బ్రభుత్వమువారికిఁ బంపుకొనుచుండుటయుఁ జెన్నపురి పండితులు రజస్వలావివాహఖండనవాదములం బ్రచురింపఁగడంగిరి అట్టియెడ నీవిషయమై విపులమైన గ్రంథమే యొకటి వ్రాసి బ్రాహ్మణులు పరిభవులయనుగ్రహమునకుఁ బాత్రులగుటకును నైనను గాకున్నను నేతద్దురాచారగ్రహవిష్టులు కాకుండుటకును యోజించుచుండ మన్మిత్రులగు ప్రకృతగ్రంథకర్తలు తాము వ్రాసియేయుంచితిమనియు దానిఁ దమమిత్రులింకెవరో ప్రచురింపనుండిరనియు నాతోనుడివిరి అపుడు నేను బత్రికాముఖమునఁ బ్రకటితమైన బహుదేశముల విదితమగునని బోధించి వివిధకార్యవ్యాసక్తుఁడనగుట వేఱుగ వ్రాయఁజాలక యీగ్రంథమే కైకొని నాపత్రికయందు వత్సరార్ధమునుండి వరుసగాఁ బ్రకటించితి గ్రంథకర్తలీగ్రంథలేఖనమునకుఁ దగినంతసామగ్రిని జక్కగాసంపాదించి యసంస్కారులగు సంఘుసంస్కారులవాదములను ముక్కలుముక్కలుగ ఖండించియున్నవారు విపక్షులవ్రాఁతలను వివిధయుక్త్యనుభవహేతుచరిత్రలచే నామావశిష్టములుగఁజేయుచుండ శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాససూత్రాదులనేకము లుపయోగించి భాష్యానుసారములైన తదర్థములను విపులముగా విలిఖించియున్నవారు నవనాగరికులు శాస్త్రజ్ఞులకును దురవగాహములగు శ్రుతిసూత్రాముల నెత్తికొని తమ మిడిమిడిజ్ఞానముచేఁ దమయభిప్రాయముల కనుకూలముగ నేమేమియో యవకతవకవ్రాఁతలు వ్రాసి తమబోంట్లచేతనే నడపఁబడు పత్రికలలోఁ బ్రచురించినవిషయములన్నియు బహుశ్రద్ధతో సంపాదించి వానినన్నిటిని ఖండఖండములు గావించిరి సనాతనధర్మానుయాయులైనపండితుల ననేకుల మీరికివచ్చినట్లెల్లఁ దిట్టివ్రాసిన సంఘుసంస్కారిణాము లీగ్రంథముం గాంచి నోటికిఁ దాళము వేసికొనవచ్చును శాస్త్రిజటిలములు గాక సామాన్యులకుఁగూడఁ దెలియఁదగిన సులభశైలిలో శ్రుతిస్మృతిసూత్రాదులం జాలఁ జర్చించి వ్రాయఁబడిన యీగ్రంథము సంఘుసంస్కర్తృనామకములైన లోకోద్ధారంమన్యపర్వతములపాలిఁటికి వజ్రాయుధమువంటిది ఈరజస్వలావివాహవిషయమై యింతవఱకు శాస్త్రజటిలములై శాస్త్రజ్ఞులకు హృదయరంజకములైనగ్రంథములున్నను నిట్టి యాబాలవృద్ధముఁ దెలియఁదగినది పుట్టియుండలేదు ఇట్టి వర్ణసంకరకారకములైన తర్కవాదము లన్నింటిమీఁదను నొక్కొక్కగ్రంథము వ్రాయ బద్ధకంకణులైన యీగ్రంథకర్తలఁ బరమేశ్వరుఁడు బరిపూర్ణాయురారోగ్యములనిచ్చి పరిపాలించుఁగాక ఇందలి యుచ్చుతప్పులఁ గొంతవఱకు పట్టికలో వివరించినను మఱికొన్ని యుండకతీరినదికాదు లేఖకప్రమాదమువలనఁబొడమిన రజస్వలానంతరవివాహ గౌరవనీయాదులును ముద్రాపకప్రమాదమునలోపించిన శకటరేఫలు నరసున్నలు పొట్టలోసున్నలు పొల్లులు మున్నగు స్వల్పదోషముఁ జదువరులే సవరించుకొందురుగాక

జానపాటి పట్టాభిరామశాస్త్రి
అభినవసరస్వతి పత్రికాధిపతి

# విషయసూచిక